నిసుఁగాలుఁగోసిన నీచులు నీపసితనమైన
నోక్కింత తలఁచరన్న
తవిలి రాతిరి ఘనాటవిఁగాలుగోయ
నాజాలికేఁగతి నోర్వఁజాలితన్న
గీ. పాపిదైవంబునకు నేంతవైరమన్న
యెంతలే బ్రాయమన బాధలెనసితన్న
భంగములకోర్చి యేలీల బ్రదికితన్న
తలఁచినంత సంతాపంబు గలుగునన్న

కావుననేకదా నీవింత ప్రజ్ఞావంతుఁడైనది? నీయట్టి ముద్దుపాపని కకారణ శత్రువు లెట్లేఁబ్బడిరో ఏదురాత్ములు, ఏహాలాహలహృదయులు నీకిట్టి పరిభవముగలుగఁజేసిరో. అంతపగసాధించిరో. కుమార! నీ చరిత్రమింత సకరుణముగా నుండునే! (దుఃఖించును)

కుళింద—మంత్రివర్యా! ఎల శోకించెదవు? అయ్యో! ఎంతటి కరుణాళుఁడవు! మాపట్టి చరిత్రము నిన్నింత పశ్చాత్తాపయుక్తునిఁ జేసెనే? ఇంతయే చాలును. వాఁడుధన్యుఁ డయ్యె. ఇట్టికృపాబుద్ధి నేవీనిఁ గాపాడుకొనిరావలయు.

కుంభీ—కుళిందకా! ఈతనయుని పాటువిన్నెట్టి వజ్రపుగుండైనను గాలియంగార ప్రాయమై పోవదా? నాతనివిదీఱ నింతటిపాటుదప్పిన వానికేమి యుపయోగము గావింపఁగలను. కుమారా! ఇట్టియద్భుత చరిత్రుఁడవు నీవు. నీవుబ్రదికియున్నంత కాలము నన్నుఁ దలంపుమానఁజాలని దివ్యసుఖము గలిగింపనాసుతునకు బాబుబ్రానిపంపుదు. నీవు రేఁపుదయముననఁ గుంతల రాజధానికిఁ బ్రయాణము కావలయు.

చంద్ర—భాగ్యము. మన్నింతు వేని యొకవిన్నపఁమొనరించెద.

కుంభీ—అదేమి? నిర్భీతిగా వచింపుము.

చంద్ర—చిన్ననాటినుండి నాయొద్ద నొకసాలగ్రామమున్నది. అరణ్యముననుఁగాలంద్రించిపి నడుపు నాయొద్దనుండె. దానిమహాత్మ్యమువలననే కాబోలు గొంతుగోయ నుంకించిన హంత్యకారులు కాలుమాత్రముకోసిరి. నేను పెద్దవాఁడనైన పిదప నాసాలగ్రామము వాసుదేవమూర్తియని యెఱిఁగితి. సభక్తిమైరి యాపరమేశున కిందొక్క యాలయము కట్టించియున్నాఁడ. రేఁపుదయమున నందు స్థిరవార పూజ మహోత్సవముగా జరుగగలదు. కావున—

కుంభీ—ఇంకేమి యుము ననకుము. మఱియు మేలయ్యె. అపూజ జరిగినపిదపనే పోయెదుగాని లెమ్ము.

కుళింద — మంత్రివర్యా! ఆ దేవోత్సవమునకు నేంచేయుటకు నీ కేమైన నభ్యంతరము కలదా యని యడుగవచ్చునా?

కుంభీ — నేను స్థిరవార ముదయమునఁ జరజ్జపమను వ్రతము గావించువాఁడను. ఊరివెలుపల నడుచుచునే చేయఁదగిన దగుటం జరజ్జపమనిపించుకొనియె. సాయంకాలమున —

కుళింద — భాగ్యమట్లే నీయచ్ఛచొప్పునఁగానిమ్ము.

కుంభీ — ఇంక మీరు సెలవుగైకొనవచ్చును. (చంద్రహాసు నాలింగన మొనర్చు.)

కుళింద / చంద్ర } (నమస్కరించి, నిష్క్రి.)

కుంభీ — హా! దైవమా! ఇట్టి విపరీత మెందైనవింటిమే? అమణిమంత హంతకుఁడెన్నఁడో నీళ్లనిద్దురవోయెనని నమ్మియుంటినే? తుదకిదియిట్లు పరిణమించెఁగా? ఆయఘోరుఁడను కృతఘ్నునకు వేయిరూప్యముల నిచ్చితినే. ఇట్లు గావించుటకా? అయ్యయో! ఈ దావాగ్ని నేనెట్లుసహింతును? ఆయఘోరుఁడను చండాలునితోఁ దలదెచ్చి యిమ్మనక యేనోనోకయంగమఁ దెచ్చియిమ్మనియేల కట్టడి వెట్టితిని. ఇంత మాగణోద్యోగమునకు సమ్మతించియు నాతలఁజూచుటకే నేలగోఁతఁగలిగించుకొంటి? తీఱె. నాపని యంతయుఁదీఱె. బుద్ధికదలకుఁబాఱె, దుఃఖాంబుధిమీఱె, సర్వాశాంతము సమకూఱె.

కవిరాజ విరాజితము.

తలఁగొనిరమ్మని యాజ్ఞయొనర్ప తప్పొనరించితి నెంతయుదు
ర్బలమతి నంగము దెమ్మని పల్కితిఁ బశ్చిమబుద్ధిననాకొడవే
విలయముడాసె విశంతక బాసె వివేకము మాసెను నాగతికే
దలఁపగ నెంతనినాముడిమేలపు దైవముదూరెద మూఢుఁడనో.

ఇంకనేమిచేయుదుని "సప్త సంద్రైవచింతనం" అనుభంగినాసప్తమభంగియే చెలంగెఁగా ఆహా! "తానొకటి తలఁప దైవము తానొక్కటితలఁచు" ననుట కిదియే తార్కాణము గదా? ఇంకేమిచేయఁగలను? నాయన్నియభిలాషములను మాసెదను. రాజ్యమా! నాతలఁపునుండి వెడలిపొమ్ము. ఐశ్వర్యమా! నీకునాకుఁ గడుదూరము. హా! దైవమా! ఆహా! నేనేల యింత జేలనయ్యెద!

అనుబంధము 10.

ఇప్పటికేని మించిపోయినదేమి? అప్పుడే ప్రతిక్రియ నూహించితినే? ఇంతలోనేల నిరాశ. ఈ రాజ్యమున కీచంద్రహాసుఁడు సార్వభౌముఁడై యాబాలవృద్ధముగాఁ జల్లని దొరయని పొగడొంది యున్నాఁడు. ఇందు వీనికిఁ గీడుచింతించితేని సాకేవాసమగును. స్థలాంతరవాసుఁడనియు, ద్రవ్యైకదర్శియగుట నిష్కరుణతాదండధరుఁడని నుతిగన్న

వాఁడనియు నమ్మిన యఘోరుఁడే యిట్లొనర్చె. ఇంకెవ్వరి నిట్టి కార్యమునకుఁ బెట్టవలయు. "తానొనర్చుటుత్తమము. కొడుకొనర్చుట మధ్యమము. అన్యుఁడొనర్చుట పాడు" అ లోకోక్తికలదు. కావున నాయభీష్టకార్యము నేనైన, నాకొడుకైనఁ జేయవలయు. నాకొడుకులోఁడను జేయింపఁజూచెద. నేనుంజేసిచూచెద. నాకొడుకునకు జాబువ్రాసెద. వాఁడు నాయానమీఱజాలనివాఁడు. అట్లుమీఱఁజాల కుండుటకు వానికినొక మోసము గావించెద. వాని వాసంతికం గొనుటకు సమ్మతించెదనని యంటినా, వాఁడుతనతల్లినయి నను జంపఁగలిగినంత యుత్సాహముగలవాఁడగు. కార్యమొకటి కాఁజేయనీ. తర్వాత వానఁ — కైఁటికయే. ఇదయేమేలు. (జాబువ్రాసి) ఓరీ!

[ ప్రవేశము. సేవకుఁడు. ]

నేను నాకుమారున కొక యత్యావశ్యకమగు రాచకార్య విషయమై యీజాబు వ్రాసియున్నాను. ఈజాబునీ వెవ్వరికిం జూపక నీవియ్యెడకుఁ బోదువనియైన వచింపక గుఱ్ఱము నెక్కి శీఘ్రగమనమునఁ గుంతలమునకుఁబోయి మామదనున కీజాబిమ్ము. ఈ జాబులో వ్రాసియున్నవాఁడు. రేఁపు సాయంతనమున నిచ్చోటువిడిచి రాఁగలఁడనియు, అతినిగుఢించి నేవ్రాసియున్న విచారము సంకోచింప కొనర్పవలయుననియు, నోటిమాటలఁ జెప్పుము. ఇప్పుడే ఈ రాత్రియే నీవు వెడలి పొమ్ము.

సేవక — భాగ్యము. (నిష్క్రమి)

కుంభీ — ఇప్పుడా వాలుదేవ సాలగ్రామ మెక్కడనుండునో చూచెదఁగాక. (నిష్క్రమి)

——:(o):——

## తృతీయాఙ్కము.

### ద్వితీయరంగము-చందనావతిలో వీధి.

[ ప్ర॥ చంద్రహాసుఁడు, కుళిందకుఁడు, గుఱ్ఱసైన్యము (అందఱు నుత్సవముతో.) ]

చంద్ర—సైనికులారా! ఈపౌరులనేల నిర్బంధించెదరు. వారినూరకపోవనిండు. కొంచె మెడముగలుగ మాత్రము చూచికొనుఁడు.

(ఒకయమ్ము చంద్రహాసుని చేతికిఁ దగులును.)

చంద్ర—హా! (అని గుఱ్ఱమునుండి వ్రాలును.)

కుళింద—(వచ్చి) కుమారా! కుమారా! ఇదియేమి (దుఃఖించును.)

సైనికులు—పట్టుఁడు. పట్టుఁడు. ఎవడో మానవ హంతకుఁడు మాప్రభువుఁ జంపఁదనమ్ము వేసినాఁడు. ఆవైపున నుండివచ్చినది. అందేయుండోనుండవలయు. చూచిపట్టుఁడు.

(అందఱు అలబలము చేయుచుఁ బోయెదరు)

కుళింద—అయ్యో! కుమారా! నాకింత భాగ్యమైనను దైవము చూడఁడాయెనే? అయ్యో! నేనెట్లు భరియింతును?

చంద్ర—(లేచి) జనకా! ఏమియులేదు. నీవు భీతిల్లకుము. ఏవఁడో గురితప్పినాఁడు. శ్రవణమునకు మాత్రముతగిలి యంతనెత్తురువచ్చినది. ఒక్కింతయినను నపాయముగలుఁగదు. దేవదర్శనమునకుఁ బోవుదము. ఏమియు లేదు.

అనుబంధము 11.

సైనికులారా! నాకపాయ మొనర్పనెంచిన వాఁడెవ్వఁడైనను మొఱకుఁదనమున వాని బాధింపకుఁడు. నేను దండ్యుఁడనని యతఁడెంచిన నా శిరసును మనసార యొసంగ నేనేసిద్ధముగానున్నాఁడనే? యీభంగియేలయని వచింపుఁడు.

[ ప్ర॥ సైనికులు కుంభీనసుని బట్టుకొని వత్తురు. ]

సైని—రాజచంద్రా? ఈదురాత్ముఁడే నీకుఁగీడొనర్ప నుద్యమించినవాఁడు. మాకాజ్ఞ యిడీ పట్టణమధ్యమున నిప్పుడే వీని నింతింతఁ గోయుదుము.

చంద్ర—(చూచి) అయ్యయ్యో! దురాత్ములారా! ఈమహామహుఁడు నాతండ్రినిఁ బోలినవాఁడే? నాయేడుగడయే? నాదైవమే? ఈతనినా మీరిట్లు పరిభవించితిరి? మీచేతులఁ బురువులు పడవే?

తే. గీ. సిగ్గుగలుఁగదె మీకు దుశ్చింతులార
ప్రాణములయాశ లేదె పాపాత్ములార
ఈ మహాత్ముఁబట్టి మీకిట్లు చేతు
లాడె పలుగాకులార క్రూరాత్ములార.

మంత్రివతంసమా! నాభటులగు నీ దురాత్ములు నీ కొనర్చిన యవమతి నాజన్మమునంతవఱకు నన్నపకీర్తిభాజనుఁ గావింపఁజాలియుండు. రక్షింపుము. రక్షింపుము. (అని నమస్కరించును) పురరక్షకులారా! ఈ సైనికహతకులను నేఁడే పట్టణమధ్యమున-

కుంభీ—చంద్రహాస! లేవుము. వా రేమపకారమొనర్చిరి? చరజ్ఞపరాయణుఁడనై తిరుగాడుచున్న నన్ను వీరేల యిట్లు పట్టుకొనివచ్చిరి? ఇది వచింపుము. అయ్యో! నీయంసమూలమున నిట్లేల రక్తముగారుచున్నది? ఏమీ వృత్తాంతం.

చంద్ర—సుధీసచివతిలకమా! దేవాలయమునకుఁ బోవుచున్న నాకియ్యెడ నా వైపున నుండి యొకమ్ము తగిలె. నన్నుఁజంపఁబూనినవాఁడెవ్వడో చేఁదప్పిపోవ నిచ్చినాఁడు. నా సైనికులు—

కుంభీ—(చంద్రహాసు నాలింగనముచేసికొని) కుమారా! దైవమునకే నీయెడ బగయున్నట్లున్నది. ఎన్ని గండములు తప్పించుకొనఁగలిగె?

అనుబంధము 12.

చల్లని ప్రభువని నిన్నెల్లెడఁ గొండాడుచున్న నీ రాజ్యమునకు, ఇట్టి యసంతుష్టమానవాధముఁ డున్నాఁడా? ఇంక నీ వెట్లు భరింపఁగలవు? అయ్యో! చంద్రహాసా! (దుఃఖించును).

చంద్ర—మంత్రివతంసమా! యోచింపకుము. దైవానుగ్రహ మొకటి గలిగియుండవలయుగాక, యిట్టియుపాయము లెన్ని కడచనఁజాలవు? కొంచెము నిమ్మళింపుము. నీయట్టివాని నకారణముగా నవమతియొనర్చిన దురాత్ముల :—

కుంభీ—నాకొఱకై వారిక్షమింపుము. నీయెడలఁ బ్రీతిగలవారగుటచే వారు పొరబాటున నిట్లొనర్చిరి కాక వేఱుకాదు.

చంద్ర—దురాత్ములారా! ఈ మంత్రి చంద్రుని కరుణజేసి బ్రతికితిరి పొండు.

సైన—అయ్యా! క్షమింపుము. నీకొరకై మేము మరణమన్నఁ దృణముగాఁ జూచెదము. మమ్ముఁజావువలనఁ దప్పించు పుణ్యము గట్టికొన్న నెంచిన యీమంత్రివర్యునకు మేము వందన మొనర్పవలసిన వారమయ్యు నిట్టి మానవశ్రేష్ఠుని పుణ్యమున నిలుపఁగలిగిన ప్రాణములు మాకువలదు. ఇపుడే కైకొనుము. ఉన్నమాట చెప్పుటకు వెనుదీయము. ప్రమాణము చేయుమన్నఁ జేయుగలము. ఈతఁడు దప్ప—

కుంభీ—(నవ్వి) అమాత్యా! వీరికట్టి భ్రాంతి. అయిన నిట్టి విశ్వాసయోగ్యులగు సేవకు లున్నందునకు—

చంద్ర—ఇంక నోరమూయుఁడు. మంత్రీంద్రా! ఎట్లుగు వచ్చియున్నాఁడవు.—

కుంభీ—దేవాలయమునకే పోవుదము రమ్ము. (నిష్క్రాన్తి).

———(o)———

## తృతీయాఙ్కము-తృతీయరంగము.

———*———

### కుంతలోద్యానవనము.

[ ప్రవేశము చంద్రహాసుఁడు (హయారూఢుఁడై).]

చంద్ర—అహా! ఈ యుద్యానమెంత మనోహరముగా నున్నది? నాయశ్వము మిక్కిలి యాయాసముగొనియున్నది. ఈ రెండు దినములలో నలువదియోజనములు వచ్చి యున్నది. ఇందింత విశ్రమించుకొనియెద. నాకు మంత్రిపుంగవుఁ డేమి సౌఖ్యము గలిగింప నున్నాఁడో యెఱుఁగను.

### అనుబంధము 13.

(జాబుతీసి చదువును.) "నేను జంఘాలుఁడను భటునివెంట నీకుఁబంపిన జాబు నందు వ్రాసియున్న చంద్రహాసుఁడీ జాబు తెచ్చునతఁడే. కొంచెమైనను యోచింపకనే నీకాజ్ఞాపించియున్నపని యొనర్పుము. ఇతనిగుణములిట్టివియనియు నితనివలన సంపూర్ణము లగుకార్యము లిట్టివనియు వర్ణింప శక్యముకాకుండు. నీవు నాకుఁ గొడుకవైనందుకు నే నాజ్ఞవెట్టిన కార్యమొనర్చుటయే ఫలము. దానివలన నీ యభీష్టమును, నాయభీష్టమును నెఱవేఱఁగలవు" ఏమి యొనర్ప వ్రాసియున్నాఁడో యించుకయుఁ దెలియకున్నది. ఈజాబును మాయకయే నాకిచ్చి నాతో జెప్పఁడాయె. ఇంతకు నాజంఘాలుఁడు వచ్చి యున్నాడో, లేదో, వాఁడు నాకంటె నొకదినము ముందే చందనావతినివిడిచె. నాయశ్వ మెంతవేగము కలదియైనను నేఁడుదయమువఱకైన వాఁడువచ్చియుండఁడా? సావకాశముగా విచారించుకొని పోయెదఁగాక. నాకు నిద్దురవచ్చుచున్నదింత పండుకొందును.

[ ప్రవేశము. చంపకమాలిని, వాసంతిక. దాసి. ]

## అనుబంధము 14.

చంప—వాసంతికా! ఊరకుండుము.

వాసం—నన్నూరడిల్లు మనవేల. నాకేమియు యోచనలేదు.

విషయ—చంపకమాలినీ! వాసంతికా! మన మావైపునకుఁబోయి వనవినోదములఁ దిలకించి వత్తమా!

చంప—ఇంతకంటె నేమికావలయు? వనమంతయు దిరిగితిమే, భోజన మయినప్పటి నుండి?

విషయ—నాకింకను జేసినభోజన మరుగనేలేదు. అట్లు పోయివత్తమురండు.

చంపక—మా చేతఁగాదు. నీవుపోయి రమ్ము.

విషయ—ఇంతలసభావ మేటికే? దాసీ! ఆవైపునఁ బోయివత్తము రమ్ము. చంపకమాలినీ! నేనిపుడ మరలివత్తును. (నిష్క్ర-తి)

చంపక—(కూర్చుండి) వాసంతికా! కూర్చుండుము. ఏల యిట్లు యోచించెదవే! నీ యభీష్టములన్నియు నెఱవేఱఁగలవు లెమ్ము.

వాసం—(కన్నీరునించి) చెలియా! నేహతభాగ్యురాలను, ఊరక తీఱరాని పిచ్చి మోహము వట్టితిని ఇంత బేలనైతిని.

చంపక—సఖీ! నిక్కముగా నీవు బేలవే.

## అనుబంధము 15.

ఇంతయూ మదనుని హృదయమానసము గుఱుతింపఁ జాలవు? వాఁడు వ్రాసియున్న జాబునైనను జక్కఁగా చూడవే? ఎంత సకరుణముగా వ్రాసియున్నాఁడు. మీఱరాని జనకాజ్ఞవలనఁ గాక యతఁడు రాకుండునా? యోచింపకు మింతలోననే యతఁడు వచ్చును.

వాసం—నెచ్చెలీ! ననుక్షమింపుము. నేనా మదనునిఁ జూడఁజాల. మాచి సంతాపము భరియింపఁజాల. లేని వ్యర్థాశలు నాకేల కలిగించెదవు? క్షమింపుము.

## అనుబంధము 16.

చంపక—అనుఁగా! ఇదేటిమాట? జనకాజ్ఞ మేరకు మదనుఁడు మన యంతఃపురమునకు రాఁడనికదా మనమీ వనభోజన నెపము పెట్టి వాని నియ్యెడకు బిలిపించితిమి? ఇట్టిచో వానికి నీ సమ్ముఖము గలిగింపకున్న నెట్లుండును? అదిగో! మదనుఁడియెడకే వచ్చుచున్నాఁడు. వలసినదంతయు నడిగి తెలిసికొనుము. నేనా విషయ యున్నయెడకుఁ బోయెదను.

వాసం—చెలీ! పోకుము. పోకుము. (చీరపట్టి) నన్నొంటిగా నిలుపకుము. ఈ పది దినములనుండియు సంతాపము తగ్గించుకొనుచు మానుచు వచ్చియున్న నాకుఁ గ్రొత్తఁగా నేటికిఁ గలిగించెను? వలదు. వలదు.

చంపక—వాసంతికా! ఇట్టి మూర్ఖ్యము నీకేలగలిగె? సంతాపము సంతాపమని నీవేల యిట్లు వనటఁజెందెదు? ఎట్టి కార్యమైనను ప్రాణమైన నొసంగి సమకూర్చునా యాప్తసఖి నీకుండ సర్వైహిక సౌఖ్యములు నీవలననే కలుగునని ప్రాణపదముగానిన్ను నమ్మియున్న మదనునట్టిపతి నీకుండునీకు సంతాపము కలుఁగునా?

## అనుబంధము 17.

ఇది యంతయు మీ మోహము పరిపూర్ణ ఫలమునకు వచ్చుటకై కలిగిన యవశ్యాంతరాయమని భావింపుము. ఇందువలననే మీయానందము మఱింత యెక్కువగునని నమ్ముము. నను విడువుము, (విడిపించుకొని నిష్క్రా))

[ ప్రవేశము. మదనుఁడు. ]

వాసం—(మొగ మావైపునఁ ద్రిప్పి కన్నీరునించును.)

మదన—కామినీ! ఏటికిట్లు కన్నీరు నించెదవు? ఇట్టివంతకు ముఖ్య కారణమయిన యీ పాపాత్ముఁగన్నెత్తి తిలకింపుము. (కన్నీరు తుడుచును.)

వాసం—(చేయివిసరి యేడ్చును.)

మదన—మనోహరణీ! నేనిక్కముగా క్షంతవ్యుఁడఁగాను. నీకెంతయుఁ జెప్పగాని యపరాధ మొనర్చినవాఁడ. నా మనవిమాత్ర మింతయాలకింపుము. పిదప పలసినశిక్ష యొసంగుము.

సీ. ఇంతైన నరయక యిలాగు కనలూని
  తలఁకంగఁదగునె యోకులుకులాడి
చెన్నారఁగటగంట నన్నింతకనవు
  నీకీరసమింతేల యెమ్మెలాడి
యకట నామనవి నీవొకయింతవిను
  నంతచెవికి ప్రేఁగగునె యోచిన్నెలాడి
యపరాధము లెయ్యున్నఁ గృపమీఱ
  నొకమాటుమన్నింపఁదగదె యోవన్నెలాడి.

గీ. నీవు మనసారనన్ను మన్నింపకున్న
  మేను బరువగు నియాన మెచ్చులాడి
వినుము నాయన యే నేరమును నెఱుంగ
  మోహమును విడనాడకో ముద్దులాడి.

నిన్నెల్లప్పుడు ప్రాణపదముగా భావించువాఁడు. నీవు లేకున్న నీలోకమే తనకు లేనట్లు త్రికరణశుద్ధిగాఁ దలఁచువాఁడు. సర్వాశలు నీపైననే మోపెట్టియున్నవాఁడు. నీవు నిక్కముఁ బుట్టినింటిగా నిన్నాశ్లేషింపఁగలుగు కాలమును మేఘోదయమును వానకోయిల వోలె నెదురు చూచుచున్నవాఁడు. ఉల్లంఘింపరాని జనకాజ్ఞకై యుదయమునుండి మఱల నుదయము వఱకు నొక్కటే భంగి నాహార నిద్రలెఱుఁగక రోదన మొనర్చుచు విధిని దూఱువాఁడు నీ వనాదరణ మొనర్చినఁ బ్రాణములనైనఁ దృణప్రాయముగా మాననిశ్చయించి యున్నవాఁడు. అనన్యగతికుఁడై, విఖండిత సమస్తాశాపాశుఁడై, యవిదిత క్రియాంతరుఁడై అనవలోకిత పదార్థాంతరుఁడై, అననువేద్యదిగంతుఁడై, యననుభూత సౌఖ్య ప్రక్రియుఁడై, అజ్ఞాతశ్రాంతుఁడై, అక్రమితచింతుఁడైయున్న మానవమాత్రుఁడు. మనస్సాక్షిగ నున్న సంకటములు వచింప విని మన్నింపఁ గతూహలము గలదేని యాలకింప వలయునని నీచరణములపైఁబడి విన్నవించువాఁడ. (అని కాళ్ళపైఁ బడును).

## అనుబంధము 18.

వాసం— ఆర్యా.

మదన— అయ్యో! వాసంతికా! ప్రియాయనుట మానితివి. నాథాయనుట మానితివి. మోహనా యనుట మానితివి. మదనా యనుట మానితివి. ఆర్యా యనసాగితివి. కానిమ్ము ఇది యంతయు నాదురదృష్టముగదా?

## అనుబంధము. 19.

తరుణీ! నేనెంత యపరాధము గావించినవాఁడనైనను, అంతటి ద్రోహాత్ముఁడఁ గాను సుమా! రాజాంతఃపురము నొద్దకుఁ బోవలదని మాజనకుఁడాజ్ఞ పెట్టియున్నందున నేపడిన సంతాపము విచారించువారే లేకయున్నారు.

తరుణీ! తండ్రిమాట నతనికే కరుణ కలుగవచ్చుననియు నింతలోఁ బిత్రాజ్ఞ యుల్లంఘనము చేసినపాపమేలయనియు నింతతడసితిఁ గాక యన్యము కాదు. నేఁడో రేపో యతఁడు రానున్నవాఁడు వచ్చినవెంటనే యతని చరణములపైఁబడి, యానతిఁగాంచి ధన్యుండఁగా నెంచియున్నాఁడను. కావున నింతలో నన్ను నార్యాయని యనఁగఁటఁ జూడకుము. చూచితివా, నా ప్రాణములు నిక్కముగా నిలువవు.

వాసం— పోనిమ్ము. ఇంతైన వచింపుము. నీతండ్రికి నాపై నింతపగయేల?

మదన— తరుణీ! పగయేల కలుగును? ఇట్టి యకారణవైర ముండునా? ఏమికారణమో యాకస్మికముగ నూరికిఁ బోవనున్నవాఁ డదేమిదైవాయత్తమో. యట్లు వచించె. వేఁడుకొననైన నవకాశము గలుగదయ్యె ఈబుద్ధి యెన్నాళ్లుండఁగలదు లెమ్ము. వచ్చిన వెంటనే త్రిప్పెదను.

వాసం—నాభాగ్యము నేనేమనఁగలను? నీతండ్రి నాపైఁ జింతమానుమని కూఁతలిచ్చెనని వ్రాసితివిగదా? ఇంకెవ్వరినైనఁ బరిణయ మాడుమనెనా? లేక బ్రహ్మచర్యమునే యుపాసింపుమనెనా?

మదన—తరుణీ! ఆసంకటము నన్నడుగకుము. నానోటినుండి నాదుశ్చరితము వాడింపకుము. రెండు, మూడు దినములలో నాయభీష్టము లన్నియు నెఱవేఱఁగలవు కదా యేల త్వరపడియెదవు?

వాసం—సచివోత్తమా! నీవేల యూభ్రాంతివహించెదవు? నీతోడనన్నేల నెఱవేఱనికోరికలకాశ పెట్టెదవు? కారణము లెన్నియో నాలోచించి మీతండ్రి నీకాయాజ్ఞనొసంగెఁగాక యూరక తనకిఁ బిచ్చిపట్టెనా? నన్నింకఁ దలఁపకుము. మన ఋణమింతియే యని యెంచుము. నీకేమి నాయట్టియు, నన్ను మించినట్టియుఁ దరుణులు లెందఱో దాసులై యుండఁగలరు. నాకుఁగదా ప్రాప్తము చాలదు. ఊరకాశలు పెట్టుకొనకుము నన్ను మఱవకుము. అంత తీవ్రశాసన మొసంగియున్న తండ్రి మాటలనన్న వరించుటకు సమ్మతించునను వెఱ్ఱిభ్రాంతి? వదలుము-వదలుము చెలితనము మాత్రము మఱవకుము నీవును, నీతండ్రి కోరికలిగించెడు నీయిల్లాలుతో సుఖముగానున్నఁ జూచి సంతోషించుటయే నాకుఁబదివేలు పొమ్ము. నమస్కరింతును.

మదన—నాశీలరత్నమా! నాజగన్మోహినీ! నన్ను మన్నింపుము. ఇన్ని దినములనుండి నన్నుఁ జూచియు నామనసు నింతారయనైతివే యని వందురుచున్నాఁడఁగాక నీమాటకు నాకేమి దుఃఖము గలుగదు. నాతండ్రి నన్ను వరింపుమన్న దుశ్చరితము నూరక వెలికేల చెప్పవలయునని మానితి. నీవీమాటలాడుటవలన విధిలేక చెప్పవలసివచ్చెడు అదియేదియెట్లున్నను జగమంతయు నావలననిలువవలసివచ్చినను, నన్నింతింత గాఖండించినను, తండ్రిగాఁ డాపితామహుఁడేనను నిర్బంధించినను, నిన్ను మానిన వనితాంతర, ప్రసక్తికి నిశ్చయింతునని నమ్మితివా? నామోహ మంతయు లికిపోవునది యని విశ్వసించితివా? కొడుకే తనకుఁగావలసియున్నవాఁడైన నాతండ్రి నిన్నుఁ జెట్టపట్టుటకు సమ్మతింపఁడా? సమ్మతింపక యేపోనిమ్ము. ఇంతవిశాలమయిన యీజగమున మనమెక్కడ నింతపొట్టపోసికొనఁ జాలము? రాజ్యమేవలయునా? మంత్రిత్వమే వలయునా? దినదిన ప్రశంకిత దేహయాత్రా విచారుఁడనగుదీవనై యున్నను నీదండనుండఁగలను గాక రాజ్యసామ్రాజ్యమును జరణాగ్రమున మోసికొనియున్న యామాపరేందిరనైనను నేనొల్లను.

## అనుబంధము 20.

నానిశ్చయము నింత యూహింపలేవైతివా? చెప్పఁగూడదనియున్న రహస్యము చెప్పవలసి వచ్చినను బాధకము గలుగదు. మాతండ్రి నాకుఁ బరిణయమొనర్ప నెంచిన సతీమణి పేరు మాత్రము నేనుడివితినా యప్పుడే నాశ్యమునేఁ జేయఁజాలుటయుఁ బాలకుం

డుటయు నూహింపఁగలవు ఎవరినిఁ బరిణయమాడుమనెనంటివి? మఱియెవ్వరినిఁ గాదు. నాతల్లి వరుసయన్న నేమి, తోఁబుట్టువు వరుసయన్న నేమి, యేమన్నను బూజనీయురాలగు చంపకమాలినీ సతినిసుమా ఇంకనైన నూహింపుము.

వాసం—నిక్కముమా? (నవ్వి)

మదన—నీయాన నిక్కము దీనికి నేనవ్వవలయునో యేడ్వవలయునో యెఱుఁగను.

వాసం—మాయన్న మణిమంతుని నరయఁ బోయిన వృత్తాంతమును జంపకమాలినిమామామ యతనికి నివ్వనెంచియున్న వృత్తాంతమును మీతండ్రి యెఱుఁగఁడా?

మదన—ఎఱిఁగియుండ వచ్చును. దీర్ఘముగ మాటలాడుట కేయవకాశమే లేకపోయెఁగదా?

వాసం—నాథా! అయిన మీతండ్రి వచ్చిన నేమిచేయ నెంచితివి?

మదన—ప్రియా! "నాథా"యను తియ్యనిమాట నీముద్దునోట మరల వినఁగలిగెఁ గదా? ఇంక నా సర్వాశలు ఫలించె. (ఆలింగన మొనర్చును.)

వాసం—ప్రాణేశా! నన్ను విడువుము. చంపకమాలిని యదే వచ్చుచున్నది. మనమావైపు నకుఁబోయి తనివిదీఱ మాటలాడుదము రమ్ము.

(మదనునితో నిష్క్రమి).

పునః ప్ర॥ చంపకమాలిని.

చంపక—విపయయు దాసియు నెందుఁబోయిరో తెలియదయ్యె. ఇందుండిన వాసంతికయు మదనుఁడును గానరాలేదు. ఆవైపున నేమైనపోయియున్నారేమోచూచెద. (ప్రక్కకుఁ బోవుట నభినయించి పండుకొనియున్న చంద్రహాసునిఁజూచి) ఆహా! ఏమహానుభావుఁ డిందుఁ బండుకొని యుండునది? లక్షణములన్నియుఁజూడ రాకుమారునివలెనున్నాఁడు. రాకుమారుఁడైయున్న నేకతమున యశ్వారూఢుఁడై యీ యుద్యాన వనమునకు రాను గారణమేమి? ఏమిది? ఈమనోహరునిఁ జూచినప్పుడే నా గుండెలిట్లు తటతటఁ గొట్టుకొనుచున్నవి? మనసున కేమియు నెఱుఁగరాని శంకాతంకము కలుగుచున్నది. ఆహా! ఇదియా మోహము? చూచినఁ జూడఁగూడదనిపించుచున్నది. చూడకుండినఁ జూడవలెయు ననిపించుచున్నది? చూచిచూడకున్నాను. చూడక చూచుచున్నాను. ఇదియా మోహము? అయ్యో! వీనిముద్దుమోము, వీనిగొప్ప కన్నులు, వీని వెడదయురము, వీనినిడివిచేతులు, వీని శృంగారవైభవ మాయనంగునికైన నుండెనో లేదో!

## అనుబంధము 21.

ఇట్టివానికి నర్ధాంగి యనిపించుకొన్న యిందువదన సౌఖ్యమే సౌఖ్యము. అకటా! నాతండ్రి నన్నుఁ గానకున్న మణిమంతునికివ్వఁదలంచియున్నాఁడు పెద్దకాలము వినుటఁజేసి చూడనివాఁడైనను నామణిమంతునిపై మదివోదమియుండె. ఆమణిమంతుఁడు

చిక్కకుండుటఁ జేసియే కాఁబోలు నీధరణీవరునిపై నాకు మోహముప్పతిల్లి యున్నది. ఈ మహాపురుషుఁ డెవ్వఁడో మేలుకొల్పి విచారింతుఁగాక (సమీపమునకువచ్చి దిక్కులు చూచి) దూరమున విషయ వచ్చుచున్నట్లున్నది. అదిపోయిన పిదప విచారింతును ఇప్పు డాసరసినిదిగి యణఁగియుందును. (ప్రక్కకుఁబోవును)

[ పునః ప్ర॥ విషయ. ]

విషయ—ఏమిది? సాయంకాలము కావచ్చినను నొక్కరైనఁ గానరాకున్నారు! దాపి యెప్పుడో నన్నువిడిచితసికె. ఇందువచ్చిచూడ వాసంతికయుఁ జంపకమాలినియును లేకున్నారు. విడిదియొద్దకుఁ బోయియుందురు. నాకును నాయాసమయ్యెఁ బోయెద (ప్రక్కకుఁబోయి పండుకొనియున్న చంద్రహాసునిఁ జూచి) ఆహా! ఎవ్వఁడీపురుషోత్తముఁడు! రోహిణీప్రణయకాంతి నిరీక్షించుచు ధరాతలమునకుదిగి పండియున్న యకలంకుండగు హిమభానుఁడో! విన్నాటకై డాగియున్న రతీసతిని వెదకి కానక యాయాసమున మేనుమఱచి సుఖశయనము గాంచిన సాంగభూషణుఁడగు ననంగుఁడో! వసంతదిగాభోగతుష్టుండై శయనించియున్న జాతిసంయుతుండగు మాధవుఁడో! రంభాస్వరసాకల్పిత సంకేత ప్రాగాగతుఁడై పగటిపై విసుగుజనింపఁ బడియున్న నిమేషశాలియగు నైలబిల కుమారుఁడో! తెలియరాకున్నాఁడు. ఈపురుషోత్తముహృదయసీమ వసించు భాగ్యముఁగన్న చెలువదికదా లక్ష్మీవిలాసము! ఈచతురాననుముఖసీమ ముద్దాడు ధన్యతఁగన్న రమణీమణిదిగదా వాణీవిశేషము? ఈమహీశునర్ధాంగి యనిపించుకొన్న వెలఁదిదిగదా సర్వమంగళాత్వము? ఆహా! ఇంతటి తేజోవైభవముఁ బుడమినున్న యేపురుషునందును జూడనైతిఁగదా!

## అనుబంధము 22.

ఎట్లయినను జేసి యీ మహానాంగు చరణతలంబునఁ బడియెద అయ్యయో! మాజనకుఁడు నన్నెవ్వరికో ముదివరున కివ్వ నెంచియున్నాఁడే. అదియంతయు నిష్ప్రయత్నముగా నొనరించెద. ఈ పురుషవరుని మేలుకొలిపి దాసిగా నన్నేలుమని విన్నవించి కృతార్థనయ్యెద. పురుషవర్యా! పురుషవర్యా! ఆహా! పథిశ్రాంతుఁడై యధికనిద్రాయుక్తుఁడై యున్నవాఁడు. శరీరముపైఁ జేయిపెట్టినవైన మేలుకొనునేమో (శరీరము ముట్టి) ఆహా! యింతైనను లేవఁడు. ఈశరీరస్పర్శనమే నాకనంత సుఖమొసంగఁ జాలియుండు. సమ్మతివడయ కీతనియొకలు నేస్పృశించుభంగి సమ్మతిపై నీమహాత్ముని చరణములొత్తు భాగ్యము నాకుఁగలుగునా? ఈతని మేలుకొల్ప విధానమైన! నెయ్యది? ఇతని దండనున్న నానోములన్నియు ఫలించిన మహానందముగలిగెడు, ఊరకతనికీతీల నితని ముద్దాడు కుతూహలము నన్నెంతయుఁ దీవరించెడు చేయుదునా? అక్కటా! ఎంతయలౌకికము? ఎవ్వఁడో? ఎట్టివాఁడో? ఏదేశమో యను టరయక యిట్లొనర్ప వచ్చునా? ఎట్లయిన వేఱుభంగి మేలుకొలిపెద, శరీరముపై మెల్లఁగఁగొట్టును.

నృపక—(ప్రక్కను స్వగతము) అకటా! ఇదినాకెట్టి యవస్థవచ్చెను? ఇక్కడనుండి వెడలిపోవు మార్గమేలేదు. విషయయున్న యెడనుండియే పోవలయు. పొంచులువిను చుంటిననియది యేమనుకొనునో? ఇప్పటికే మిక్కిలి దూరము పోవనిచ్చితి? ఇంక యత్నములేదు. విధిలేక పొంచులే వినవలసి వచ్చెను.

చంద్ర—(లేచి విషయనుజూచి) అలివేణీ! నీవు సాక్షాత్కరించిన యౌవనలక్ష్మివలె నున్నావు. నీ వెవ్వర వింతవచింపుమా.

విషయ—ధరణీశకుమారా! ఎన్నఁడును నీవిందు వచ్చినవాఁడవు కావని తోఁచుచున్నది.

ఉ॥ పంచపాది॥

ధీరత రాగణింపక సునీగుణభూషణ నీచరిత్రము
తారయవచ్చునే వెలదుఁగరుణించి చెపవేనిఁ జెప్పుమే
యూరవసింతు నిన్నుఁగననోఁచినతల్లి యుఁ దండ్రియేవనీ
పేరదియేమి రాకొమరుపెంపు వహించియునొంటి నిందు రాఁ
గారణమేమి విస్తరముగా వినుపించి యనుగ్రహింపవే॥

అనుబంధము 23.

నీ వెవ్వర వేయూరు? ఏకతమున యశ్వారూఢుఁడవై యియ్యెడకు రానేమికతము

చంద్ర—నేను చందనావతీపురి కొడయఁడగు కుళిందకునికుమారుఁడను. చంద్రహాసుఁడని యందురు. ఈ యూరనే నాకించుక కార్య మున్నందున వచ్చియున్నాఁడ ఇంక నీ వెవరు?

విషయ—రాజకుమారా! నేనీకుంతలేశుని యొకానొక సచివునికూఁతురను. విషయయను పేరిదానను. ఈ రాజును రాచకన్నియలును వనభోజనమునకు వచ్చియున్నందున వచ్చియున్నదానను.

శా. సీతారామసరస్తటీవటపలాశిచ్ఛాయవిశ్రాంతిమై
యాంతాయాంతజనంబులంగనక నిద్రానందతాధీనసం
ప్రీతుండైనినుఁ గ్రొత్తవాఁడవనకే మేల్కొల్పి మాటాడు నా
స్వాతంత్ర్యంబు క్షమింపు మొందెలుఁగ నేసాయాహ్న మంచాడితిన్.

నీవు మిక్కిలి నిద్దురపోవుచుండఁగాఁజూచి నవీనాగతుఁడవౌటచే నీయుదంతము నెఱయ నుద్యోగించిన నా స్వాతంత్ర్యమును మన్నింపుము.

చంద్ర—(స్వ) అహా! దీని రూపముఁబోలె దీనిపలుకును ముద్దుకాఱుచున్నవి. ఇది నా మనమును హరింపఁజేయుచున్నది, (ప్రకాశము) ఓమహాదేవీ! నీవు నన్ను మేలుకొలిపి కడుపుణ్యము గట్టుకొంటివి. చందనావతినుండి యహోరాత్రములనక తుఱఁగనుపై వచ్చిన యాయాసమున శ్రాంతుఁడనై యుండుటచే తెలుపదయ సువఱునను నిద్దినిదుర చుచుంటిఁ గాఁబోలు. కార్యభారము మిక్కిలిగానున్నది. నేనిఁకఁ బోయివచ్చెద. (లేచును).

విషయ—పురుషపుంగవా! పోయెదుగాని కూరుచుండుము. ఇంకనుసాయంకాలము కాలేదు మఱచితి నీవు చందనావతినుండి వచ్చితినంటివికదా? ఇప్పుడు మాయయ్య యందుండవలయు. అతనికి—

చంద్ర—మీయయ్య యెవరు?

విషయ—దుష్టబుద్ధియనుడను పేరఁ బరఁగు మంత్రిసత్తముఁడు.

చంద్ర—ఆసచివవతంసుఁడు మీ జనకుఁడా? మిక్కిలి మేలయ్యె. అతఁడు పంపఁగనే నేనిపుడీ కుంతలమునకు వచ్చితి తరుణీమణీ! నీకుఁదోడఁబుట్టు లెవరైనను వ్నారా?

విషయ—మదనుఁడను మాయన్నగలఁడు.

చంద్ర—ఆ మదనునొద్దకే ననుమీయయ్య పంపియున్నాఁడు.

విషయ—ఏమికార్యము?

చంద్ర—ఆకార్యమేమో నాకుఁదెలియదు.

విషయ—అది రాజకార్యమగుట గోప్యముచేయఁ జూచెదవు కాఁబోలు.

చంద్ర—అకటా! నిక్కముగా నాకే యాకార్యము తెలియదు. ఆమంత్రిసత్తముఁడు నాపూర్వ చరిత్రమంతయువిని నాయెడఁబ్రేమప్రీతి గలిగి "చంద్రహాసా! నివీక్షణమున గుంతలమునకు నాకొడుకు మదనునొద్దకుఁబొ" మ్మనియె అతఁడు నాకు దివ్యసుఖము గలిగింపఁగలవాఁడని మాత్రమనుడివె. ఒకజాబువ్రాసి యొకజంఘాలుఁడను భటునిచే నాకంటె ముందుఁబంపె. నాచేనీజాబిచ్చె. ఆజంఘాలుఁడింకను మీయొద్దకు రాలేదా? (అని జాబిచ్చును!

విషయ—(జాబుచేకొని) అంటింపనైన లేదే!

చంద్ర—అట్లనే యిచ్చియున్నాఁడు.

విషయ—(జాబు చదువుకొని) (స్వ) ఈజాబు కడుచిత్రముగానున్నది. జంఘాలుఁడింకను వచ్చినట్టులేదు. కానిమ్ము. చూతము (ప్ర) రాజకుమారా! మాయింటికి విందవై వచ్చి నందున మన కపరిచయదోషముగలుగదు నేను నిన్నొకటి యడిగిన కోపమురాదుకదా! నీకు వివాహమైయున్నదా?

చంద్ర—తరుణీమణీ! నీ యడిగిన యర్థము విశదమయ్యె. నే వివాహితుఁడనుగాను. నా భాగ్యదేవతఁబోలె విలసిల్లు నీయట్టి మోహనాంగి తనకుఁ బుత్రిగానుంటుట తెలిసిన పిదప నీజనకుఁ డాడిన "దివ్యసుఖము" నర్థమిప్పుడు గ్రహించితి.

## అనుబంధము 24.

విషయ — అయిన నేఁగదునన్యను. ఏమిదైవాయత్తమో నిన్నుఁ జూచినతక్షణమే నామనసు నాదికాదయ్యె. నేను నీస్వత్వమని యనుకొంటి. చెప్పరాని మోహాతంకాభిలాషములు ముప్పిరిగొనియె. నీవు నీకడగంటిచూపున నను వీక్షించు భాగ్యము నాకుఁ గలుగునా యని వేఁకరితి. నీవీమాటలిప్పుడాడుటచే నాదైవము నెంతయుంగొండాడెద.

మనకవకాశము మిక్కిలిగఁ జాలదు. అందందు విహరింపఁబోయియున్న నాయాళిజనము నన్ను వెదకుచుందురు. మాయన్న మదనుఁడీవనమునందే యున్నాఁడు. జంఘాలుఁడు తెచ్చియున్న జాబిఁకను వచ్చియున్నదో లేదో యరసి నీ వృత్తాంతమును వివరించి యిటెచుదెంచెద. నాకు సెలవా?

చంద్ర — తరుణీమణీ! నీవు నాచెంతనున్న నీలోకమునే మఱచియుంటి.

## అనుబంధము 25.

జంఘాలుఁడు వచ్చియున్నను రాకున్ననుమానె. మదనుఁడు ననురమ్మనినను రావలదన్నను మానె ఎల్లును నేనీవాఁడేసుమా! నీవు ననుఁబాసి పోయెదవన్న నీవియోగము క్షణమాత్రమే యుండఁగలదని యెంత తెలిసియున్నను నాకు మదికి సంతోషముద్భవిల్లెడు. అయినను బోయిరమ్మా.

విషయ — అయిన నేఁబోయివత్తునా?

చంద్ర — పొమ్ము, పోయిరమ్ము.

విషయ — అట్లయిన ననుంబొమ్మంటివా? ఆనతిత్తువా?

చంద్ర — అదేల యిట్లు పలుమాఱడిగెదవు? ఆహా! తెలిసెను; కామినీ నన్ను క్షమింపుము. నేనగరవాస మెప్పుడును నొనరింపనివాఁడగుటచే నాకెంత మోహము కలిగినను మాటలమించి వేఱొక కార్యమొనర్చుటకు సంకోచించితిని, నీవై యిప్పుడనుగ్రహించిన మాటలాడితివి. ఇంకఁ బోయిరమ్ము, పోయిరమ్ము! శీఘ్రముగరమ్ము

కం. కోరికలెల్లను నేఁడే
తీరెనుగా నాదుభాగ్య దేవతవగు నీ
వీరీతిఁ గటాక్షింపను
దూరగుణాపోయి మఱలఁ దశయాకరమ్మా.

## అనుబంధము 26.

(అని యాశ్లేషించి ముద్దాడును).

విషయ — (చంద్రహాసుని ముద్దాడును)

చంద — (స్వ) హా!

విపయ—రాజశేఖరా! నేఁబోయివత్తును నిన్నియ్యెడ విడిచిపోవుటకు నాకుఁ గష్టరావు. అయినను, బోయివత్తును ఈ సరసినున్న యుదకము కడుమధురము. నే వచ్చువఱకు నీసరస్సునఁ గాలకరణీయము లొనర్చి జలపానము చేసియుండుము.

(ఆశ్లేషించి నిష్క్రమి).

చంప—(స్వ) అయ్యో! గ్రహచారమా! ఇంకేమిగతి. (పండుకొని నిద్రనభినయించును)

చంద్ర—(సరసిలోనికిదిగి పండుకొనియున్న చంపకమాలినిజూచి భ్రమము, నభినయించి) ఆహా! ఈతరుణి యెవరు? ధరణికి నవతరించిన సాక్షాద్రతీసతివలె నున్నదికదా?

అనుబంధము 25.

ఇది యింతసమీపమున నున్నది. మామాటలన్నియు వినియోఁగాఁబోలు. అయిన నిద్రించియున్నది. భయమేమియు లేదు. అయినను మేలుకొల్పి యింత విచారింతును. ఇదియు నామనసునుహరింపఁజాలియున్నది. ఎవ్వరో విచారించెద. అబలా!

చంపక—(నీలిగి మూలిగి కన్నులుతెఱచి భయము నభినయించి నిలిచి) ఆహా! నాకన్నుల కేమయిన భ్రమగలిగెనా? మానవపుంగవా! నీ వెవరవు!

చంద్ర—మానినీమణీ! నేను స్థలాంతరమునుండి వచ్చియున్నవాఁడ, నేనెవ్వఁడైనదియు విన్నవించువాఁడఁ గాని జగన్మోహనమగు నిట్టిరూపము ధరించియు నీ సరసినిట్లున నీచెట్టునీడ నిట్లు నిదురించు తలంపుగొన్న నీవెవరవో యింతవచింపుము.

చంపక—ఆహా! ఈ వృత్తాంతము నడుగుటకా నీవు నన్నిట్లు నిద్రాభంగము గావించినది? ఔరా! నీవెంత! సాహసముగలవాఁడవు? స్థలాంతరస్థుఁడవై యూరుపేరెఱుఁగని వనితలు నిద్రించియుండ నబలాయని పిలిచి నిద్రచెఱచుటకు నీకేమక్కర?

అనుబంధము 28.

మీసీమనున్న పురుషులెల్ల వెలఁదులనిట్లే యొనర్చువారా? ఆయూరైననెయ్యది యింత వచింపుము. తెలియవలయు. కాదేని యూరక నీదారిఁబొమ్ము.

చంద్ర—వనితామణీ! నేనెంతయుఁ గావరమున నొనర్చిన నీమధుర నిద్రాభంగ సాహస కృత్యమునకు నన్నుక్షమింపుము. నాయాన వచించెదను. నీమనసునకు నొప్పి కలిగించుతునని నేనెంచనైతి.

తే॥ గీ॥ రమణిమన్నింపు నాకావరంపుకరణి
కుసుమకోమలమగుమేను గులకరాళ్ళ
నెంత నొచ్చెనొయనుకొంటి నింతె కాని
యకటనీచాద మెఱుఁగ లేనైతినబల.

మన్నింపుము. మన్నింపుము.

చంపక—నా మనస్సునకు నొప్పి కలిగించినది యింతేమాత్రమా? ఇంతా గదమా? (ఏడ్చును)

చంద్ర—అయ్యయో! తరుణీజనవతంసమా! గాఢనిద్ర నీవిందుండుటనట్లే సరసిలో నెక్కడ పడియెదవో యనుభయమున—

చంప—భయమునన్నట్లే సరసినిం బడనై చితివి కాంబోలు. ఆయింత కార్య మొనర్చియున్న నీకుం గడుపుణ్యము కలిగియుండుంగా? (దుఃఖించును).

చంద్ర—అక్కటా! నేనెంత తప్పుచేసితిని? కామినీ! నాయపరాధములన్నియు మన్నింపుము. నిన్నెంతయు నలయించినవాండ నరయక నీమనమున కింతాయాసము కలిగించినవాండ. కామినీ! నేంజేసిన యపరాధములలోనిది యొకటియని గ్రహించినను ననుగ్రహింపుము. అపరిచయురాలగు నిన్నడిగెదు నాస్వాతంత్ర్యమును మన్నింపుము. నీపరితాపము చూడంగా నాకువింతగాం దోంచుచున్నది. నిద్రాభంగ మాత్రమున కింత దుఃఖించువారి నెందైనం గంటిమే? కావున నీసంతాప కారణమేమో నాకు వచింపం దగినచో వచింపం బ్రార్థించెద.

చంపక—రాకుమారా! నీవేమి యూర్చెదవా-తీర్చెదవా-నాసంతాపము? నన్నేల యడిగెదవు?

చంద్ర—అయ్యో! తరుణీ అట్లేల సంశయించెదవు? ఆర్పను దీర్పను నాకు మాత్రము శక్యముండెనా నాయాన వలయునంత శ్రమించెదను. అయ్యయో! నీయట్టి కోమలాంగికి సంతాపము కలిగింపం గలిగిన పదార్థమైన నెయ్యది? శోకింపకుము. ఊఁ అడిల్లుము నీకన్నులను గండుమీలు బాష్పనదమున మునిగి తేలుచున్నవి గదా? ఏలనీకిట్టి యలంత?

చంప—రాజచంద్రమా? ఏ రాకన్నియను. ఈ కేని మంత్రికూంతురగు విషయయొక్క నెయ్యంపుసఖిని. దానిదాసియనిన నన్నన్నను గాంజాలుదు. ఆవిషయ సరసిలోందా మునింగి యూసగసిని ననుముంచెను. విధిలేక నాకుం జూడవలసి వచ్చెను. మేలుకొని యున్నదాననై నిద్రించితి ఆసంవేశము కలవోలెం జూపట్టె. కల్లయన్నను ననుకొనుము సంవేశ భంగమైనట్లు కనిపించెంగాని సంవేశభంగము కాలేదు. భంగము కాలేదనియనం జనునా? భంగమేయయినది. ఆశలమానితి— ఆశలం జూచితి. ఆసంతాపముననే దుఃఖించితి—ఆదుఃఖముననే సంతసించితి.

## అనుబంధము 29.

చంద్ర—మానవతీమణీ! నీమాటలు నాకించుకైన నర్థము కావయ్యె.

చంప—నాకే యర్థము కాలేదు మఱొకసారి వచింతులెమ్ము.

(ప్రక్కకు నిష్క్ర.)

చంద్ర — ఇదియేమాశ్చర్యము? ఈయబలయిట్లుమాటలాడెను? యిట్లు లేచిపోయెను? ఆహా! తెలిసెను. దీనికిఁజూక యున్మాదమున్నట్లుతోచుచున్నది. దీనికేదైన సహాయమైతి. మావిషయవచ్చిన వృత్తాంతము లడుగుదుము. ఇప్పుడీసరసిని డిగి యుచితకర్మల నిర్వర్తించెదను. (నిష్క్ర-9.)

[ పునః ప్ర॥ విషయుఁడు. జాబుతో. ప్రస్థాన ]

విషయు — ఆహా! ఇది యేమనర్థముగానున్నది? మా జనకుఁడింతటి క్రూరకర్ముఁడగునే? నిరపరాధియైయున్న యీ రాకుమారునిందుఁ బంపుట చంపుటకో కాదా? అక్కటా! ఎంతఘాతుక కృత్యము. ఈ జాబుమాత్రము మాయన్న చేతఁ బడియుండెనా యీవాసంతికకై యీ కార్యము నొనర్చుచునే యుండెగాఁబోలు. నామనోహరుఁడగు చంద్రహాసున కాయుశ్శేషమున్నందుననే యీజాబు నాకేతఁజిక్కె. కాకున్న నెంతి యనర్థము జరుగనుండెనో?

అనుబంధము 30.

మాయన్నకిచ్చెదనని చెప్పి యీ జంఘాలుని యొద్దనుండి బలవంతముగా నీజాబుఁ జెప్పించుకొంటిని. తెప్పించుకొని, యెంతమోసకృత్యమైనను మానెనని మెల్లఁగ విచ్చి చూచితి. ఈపిడుగుపాటుం గాంచితి. ఇప్పుడేమిచేయుదును? నామనోరమణుని కీజాబు చూపించి హెచ్చరిక నొసంగి యూరక చందనావతికిఁ బంపుదునా? అట్లయిన నేమిఫలము ఇట్టిదురాత్ముని పుత్రియనినన్నితఁడు పరిణయమాడుటకు నిశ్చయించునా? లేక మాయన్న కూరక యీజాబిచ్చి యీకార్య మొనర్చ వలదని చరణములపై బడి విన్నవింతునా? అదియును నిష్ఫలము. మాయన్న జనకాజ్ఞనుల్లంఘించువాఁడుకాఁడు. నా ప్రార్థనపై నిప్పటికి మాత్రమూరక కున్నను నాప్రాణవిభునకు జేటు భంగినయిన కీడొనరింపఁగలడు. ఒండేని నీజాబునూరక యుల్లంఘించి నైతునా? దానివలన నేమికార్యము సాధించినట్లు? జాబెక్కడపోయెనని విచారించిన నామోసమేర్పడుఁగదా? దైవమా! ఏమిచేయుదును? ఆహా! నాకొకటితోఁచుచున్నది. అట్లొనర్చిన నెట్లుండును? దానికీజాబాస్పద మిచ్చునేమో చూచెద.

(జాబు చదువును.)

“తనయా!

కం: పు నీమోసకు రానున్న చంద్రహాసుం డనువాఁడు మనకు మహామిత్రుఁడు.

“మహామిత్రుఁడు” అమిత్రుఁడన్నను నవచ్చును మిత్రుఁడన్నను సరియగును దీనివలన దోషములేదు. ముందుఁజూచెద.

“మహామిత్రుఁడు నాయుద్యమమును లన్నియు వానివలనన విఫలములు కాఁగలవు.

“వానివలనవిఫలములు కాఁగలవు” దీనినిట్లు చదువవచ్చుఁగదా? వానివలన, నవిఫలములు కాఁగలవు మంచిమాటాయె ముందుఁజూచెద.

“ఫలములు కాగఁవు. వీఁడు మనువాఁడైన నాసర్వోపాయములనార్థకములగు”

ఇదికొంచెముకష్టము. వీఁడు మనువాఁడైన” ఇట్లయిన సరిపోవును. “ను” అను అక్షరమునఁ గొమ్ముతీసెదను. అప్పుడు “వీఁడు మనవాఁడైన” ననియగు. ఆ తీసినకొమ్ము “సర్వోపాయల” యనుచోఁ గడనుంచెదను. సాగను. వీఁడుమనవాఁడైన నాసర్వోపాయములు సార్థకములగు తరువాతఁ జూచెదను.

“సార్థకములగు. వీని ప్రభావములనంతములు. శక్తియపరిమితము. ఇందున్నవారిచే గుణభూషణుఁడనిపించుకొనినాఁడు. ఇట్టివానికేమిచేసిన దీఱునని యోచించి యోచించి, యిందేమియు నొనరింపను శక్యము కాకుండుటచేఁ గదకు నీయొద్దకుఁ బంపియున్నాఁడను.

ఇదియంతయు నిరుపాధికముగానే యున్నది. ఇంకను ననుకూలముగానున్నది, ముందు.

“ఉన్నాఁడను. వీఁడు వచ్చినవెంటనే యొండనక యిదియేమని విచారింపక నిర్భీతిమై నిశ్చేమానసమున భూరిభోజన యుక్తముగా విషమునొసఁగి ప్రాణపీడన కార్యము నిర్వహించి కడగావించి నా కానందము ఘటిల్లఁజేయుము.

దీనికేమిచేయవలయు? (యోచించి) భళీ! భళీ! ఇదియింత యొప్పునే? “విషము నొసఁగి”యనుదాని“విషయనొసఁగి” యనిచేయుట కెంతకావలయు? “ప్రాణపీడనకార్యమును” పాణిపీడన కార్యమనిచేయుట యొక హెచ్చా! ఔరా! ఇదియెంతనుకూలముగానున్నది? “భూరిభోజనయుక్తముగా విషయనొసఁగి పాణిపీడిన కార్యము నిర్వహించి కడగావించి నాకానందము ఘటిల్లఁజేయుము” అనియగు. ముందు

“నేదండ లేనని యించుకైన యోచింపక యీపని యొనర్పుము ఇదియే నీపుత్రతకు ఫలము. నాపూర్ణానుగ్రహమునకుఁ బాత్రుఁడవయ్యెదవు ఆయనుగ్రహమునకు సూచకముగా నీవాసంతికను నీవు పెండ్లియాడ నిప్పుడే సెలవిచ్చుచున్నాను. నేనొక నాలుగైనుదిన

ములలో నిక్కడ మిగిలిన కార్యములఁదీర్చి యామ్యోదను వచ్చెద. వచ్చిన వెంటనే నీపరిణయము యథావిధి నొనరించెద. ఈ చంద్రహాసో ద్వాసను మాత్రము తడవు సేయక యొనర్పుము

"ఉద్వాస" మన్న మారణము గదా! దీని నుద్వాహమని చేయుటకుఁ గష్టము కాదు భళిభళి! ఇది యిట్లనుకూలమగునే? మా తండ్రి యేమి తెలఁచియున్నను దైవమే మో నేనెంచినట్లే యగుటకుఁ దలంచియున్నాఁడు. ఇంచుకైన గుఱుతు తెలియని భంగి నీ కార్యము మొట్టమొదట నొనర్చి యీ జాబును మాయన్నకిచ్చెదను.

అప్పుడు మాయయ్య దుష్కార్యము నానాథునితోఁ జెప్పవలసిన పనియు లేదు నాకాశాభంగము గలుగు కార్యమును లేదు, నానాథునికింక ముండపాయమును గలుగదు

అనుబంధము 31.

సీ॥ బళిబళి యీ కమ్మ వెలలేని దయ్యెఁ గా
యెన్ని కార్యములఁ జేయించెనిదియు
మోహామన్ జలరాశిని నీఁగి కాననినాను
కోరిక లెల్ల నిండారు టొకటి
యేపాపమెఱుఁగక యిటువచ్చియున్న నా
ప్రాణేశు నిపుడు కాపాడు టొకటి
యసువులాఱఁగ విసంబొసఁగు చుండెనో యేమొ
మాయన్న పాపంబు వాయు టొకటి

తే॥ గీ॥ సముదయ దోషంబునకుఁ జిక్కి చంప నెంచి
యున్న జనకుని కుపకార మొనయు టొకటి
యిన్ని మది నెంచి యిటు చేసియున్న దాన
నోపి పరమేశ పాపవే పాపసమితి.

పరమేశా! నేనొనర్చినది పాపకృత్యమే యయినను నెంతో పుణ్యమున కుపకారముల కాస్పదమగునని సాహసించితి. అనవరతము నినుమదినమ్మియే పాపము నెన్నఁడు నెఱుఁగనిదాన. మాధవా! నను రక్షింపుము. మాధవా! యన్నజ్ఞప్తి గలిగె రాజ్యమునాకిన్వ నెంచియున్న మాధవా! నీకుమాత్ర మాశాభంగము కాఁగలదు. ధనాశగల వెందు లెందఱు నీకుఁ జిక్కరు? ఇప్పటికి నూఱుసిల్లుము. నేఁ జేఁదప్పితిని గాని ఊఁ... దట్లో తరుణులు నీవలఁబడఁగలరు లెమ్ము, (జాబుదిద్ది లేచిపోవుచుండ)

[పునః ప్ర॥ చంపకమాలిని.]

చంపక — విషయా? ఇదియేమే? చూచియుఁజూడనట్లు సంభ్రమమునఁ బోవుచున్నావు?

విషయ — చంపకమాలినీ! నీకొఱకై వెదకుచుంటి ఇప్పుడు నన్నువిడువుము. మరలవచ్చి మాటలాడెదను.

చంపక — ఇదేమి యొయ్యారమే? ఎక్కడకుఁ బోవుచున్నావు! మాటలైన నాడవు?

విషయ — మాయన్న యొద్దనొక తీఱరానిపనియున్నదే క్షమింపుము. నీకునమస్కరింతును నన్నువిడువుము.

చంపక — విడువక కట్టినైతునా? పోయెదుకాని కూర్చుండుము, చందనావతియుండి మీ యయ్యయొద్దనుండి జంఘాలుఁడనువాఁడు వచ్చియున్నాఁడే వినలేదా?

విషయ — వింటిని. నీకువానిచేనెట్లు తెలిసెను!

చంపక — అదియేమబ్బురము? మీయయ్యకు క్షేమమా?

విషయ — సఖీ! నేనిప్పుడేవచ్చి యంతయు వివరింతును ఇప్పుడుమాత్రమునన్ను విడువుమా నీకు నమస్కరింతును.

చంపక — నీకేనేనమస్కరింతును. కూర్చుండుము నీకొక్క వృత్తాంతము చెప్పుటకు వచ్చియున్నాను. నిన్నువిడువను ఎట్లుపోఁగలవు?

విషయ — ఇదేమి సవతిమత్సరమేనీకు?

చంపక — సవతి మత్సరమునకు దూరమేల? నీయొడినుండు కాఁగితమేమి?

విషయ — చెలియా! మనము ప్రాణసఖులము నీవు నన్నింకఁ బోనివ్వకున్న మనసఖీత్వమునకే సంశయమని యెంచుము. విడువుము.

చంపక — (విడువక) ఎంత నేర్పరివే? అదియంతయునుండనీ! నీముఖమేల యిట్లు వికాసభావముఁ జెందియున్నది? నాకంటెఁ బ్రాణసఖినీకుఁగలదా? నీసంతోషమున నింత భాగము నాకివ్వరాదా? ఈ యానందమునకుఁ గారణమేమింత వచింపుము.

విషయ — అవును బ్రహ్మానందము ఇంకనైన విడువుము.

చంపక — ఏమి మగఁడుదొరకినంత సంతోషమునున్నావు కదవే?

విషయ — నాకు మగఁడు దొరకినంత సంతోషమైన నీకు మగఁడుపోయినంతదుఃఖమో ?

చంపక — (స్వ) ఔరా! ఇదెట్టి మర్మభేదనవాక్యము? నా చందమునిదేమైనఁదెలిసినదా? (ప్ర) సోదరీ! నీవీమాటాడిననాకుఁ గోపముకలుగునని యెంచిపొరబడితివి. నీకుమగఁడు కల్గిన నాకుగలుగఁడా నాకుఁ బోయిన నీకుఁబోవఁడా? ఇంతగోప్యము చేసెదవే? నీమానసము చంద్రహాసమున ఖండించినట్లిట్లేల ఖండితోక్తు లాడెదవు.

విషయ — (స్వ) ఇదేమి యిట్లనుచున్నది? (ప్ర) కావుననే నీవును నాయెడ చంద్రహాసమున ఖండితివి కాఁబోలు ఇంకఁజాలును.

చంపక—(స్వ) నాకుఁ దెలియకున్నది. ఎంతవఱకుఁబోవునోచూచెద. (ప్ర, విషయా?) నేఁడేటికే యిట్లయితివి? మాటలు నిష్ఠురములు. మోమున నాచంద్రహాసానందశంసిక సనభావము. ఈ చంద మేమో తెలియకున్నది. ఇంతైనఁ జెప్పను. అది మీయయ్య వ్రాసినజాబా? నీకుఁదగినవమగనిఁ బంపుదునని యేమైన వ్రాసియున్నాఁడా?

విషయ—ఊఁ! నాకును నీకునుఁదగిన వానినే పంపుదునని వ్రాసియున్నాఁడు.

(విడిపించుకొని మఱియొకప్రక్కకు నిష్క్రా.)

చంపక—ఈ విషయచందము నాకించుకైనఁ దెలియకున్నది. ఇదియాడినమాటలు మర్మగర్భములు ఆకస్మికమనుటకు నొకటికాదు రెండుకాదు. కావుననే చంద్రహాసుఁ బ్రేమఁడించి చూచినచందము గుఱుతెఱిఁగియే యిటు మాటలాడినది ఎట్లెఱిఁగెను? మొదట వానియొద్ద నేనుండినది చూచెనందునా సగసిలోనున్న నావైపునైనఁ జూడదయ్యె అట్లు నేసరసినుండుటఁ దెలిసియున్నఁ జంద్రహాసుతో నంత నిర్భీతిగా మాటలాడునా? అది యక్కడనుండి వెడలి పోయినపిదప మరల నాస్థలమునకు రాలేదు. నాకేమో యగమ్యగోచరము గానున్నది. చందనావలియుండి జంఘాలుఁ డిప్పుడే వచ్చుటయు జాబుఁ దెచ్చుటయు నది యావిషయచేఁ జిక్కుటయు నాకుఁ దెలిసి విచారింపఁబూనిన నదియించుకైన నాస్పదమీదయ్యె.ఇంతమచ్చరమా!ఆచంద్రహాసుఁడు నాకెట్లులభించువాఁడు! హా! దైవమా! నేనింకెట్లు ధరించుదాన అదిగో వాసంతిక యియ్యెడనే వచ్చుచున్నది. మదనుఁడు తోడులేక విచారగ్రస్తురాలైన చందమున నొంటిగా నిట్లు వచ్చుచున్నది. నేదీనితో నిప్పుడు మాటలాడఁజాల.

(నిష్క్రా.)

[ పునః ప్ర॥ వాసంతిక. ]

వాసం—అక్కటా! సాయంకాలమయ్యె. ఇంకనూరకేఁ బోవలయు. ఇంకమామదను నెన్నఁడు చూడఁగలుగునో?

అనుబంధము 22.

ఇంత మోహము గలవాఁడయ్యు నంతఃపురము నికటమునకు రానవచున్నాఁడు. ఇతనితండ్రి యింకేటి యాజ్ఞయిడునే? ఆ తండ్రి యెప్పుడు వచ్చునో వచ్చినామనోహరుని మనవికేమనునో నాప్రాప్తియెట్లున్నదో తెలియకున్నదిగదా? ఈయుద్యానమునకైన నామోహనాంగునితోఁ దనివిదీఱ మాటలాడ వలయునన్న నెన్నియో యంత రాయములు. రెండుమాఱులు విషయవచ్చుటచే నొకరినొక రొక్కింతసేపు బాసిపోవలసి వచ్చె. ఇంతకుముందు మామామ పిలుచుచున్నాఁడని సేవకుఁడు చెప్పినందునఁబోయె. అరగడియలో వత్తునన్నవాఁడు నాలుగుగడియలై యుండియు రాకున్నాఁడు. అందేమి యంతరాయము గలిగెనో.

(పునః ప్ర॥ మదనుఁడు. జాబుతో)

## అనుబంధము 33.

మదన — వాసంతికా! వాసంతికా! మనభాగ్య మసమానము (కౌఁగిలించును)

వాసం — నాథా! నాథా! ఏమి? ఏమి?

మదన — నాకుమాటలు రావు. ఈ జాబుచూడుము.

వాసం — (జాబు చదివి కన్నులకొత్తుకొని నమస్కరించి కన్నీరునించి) నాథా! మీజనకుఁడు నాపై నవ్యాజకరుణఁబూని నన్నింత ధన్యాత్మఁజేయునే! నాకింతటిభాగ్యమున్నదే? నాథా! ఇదియంతయు స్వప్నముకాదుగదా! నేనునిదురించు చుండలేదుగదా? ఇఁక కృత్రిమపులేఖకాదుగదా?

మదన — కామినీ! అనుతాపమువెనువెంటఁ జనుదెంచు సంతోషము కడుంగడుమధురముగదా? ఊరిబడిల్లును, కార్యభారములు మిక్కిలిగా నున్నవి. ఈ జాబునందలి చంద్రహాసుఁ డిక్కడకేవచ్చి యున్నాఁడఁట. పిలుపింపవలయు. మావిషయకిప్పుడే నిశ్చితార్థ మొనరింప వలయు. ఓరీ సేవకా!

(ప్ర॥ సేవకుఁడు)

నీ వీక్షణముననఁబోయి యాచంద్రహాస కుమారునిఁ దోడ్కొనిరమ్ము.

సేవక — భాగ్యము (నిష్క్రమి)

(పునః ప్ర॥ విషయ.)

మదన — రమ్మా! విషయా! మనయురుపురకు మనతండ్రి యత్యంత మోదము నొసంగియున్నాఁడు. ఈజాబు చదువుకొనుము.

విషయ — (చదువుకు నభినయించి లజ్జించును)

మదన — విషయా! నీవిందేయుండుము. అయ్యెడ నా రాజకుమారుఁడు వచ్చుచున్నట్లున్నది. పిలిచికొని వత్తును. (నిష్క్రమి)

విషయ — వాసంతికా! కాదు మఱచితి వదినెయా! నీవీజాబుచూచియున్నావా?

వాసం — విషయా! ఇదేమి వినోదమే? ముసలిమగనిమాని మంచిమగనిఁ గలిగించుకొంటినని సరసములాడఁ జూచెదవా?

విషయ — మంచిసరసమాయెలెమ్ము. మదనునిఁ చూడఁ జేదేయని యొంటికంటియేకుపు గలిగియుంటివే. నేఁడది తొలఁదవినఁదులకా నీకీయు పేష?

[ పునః ప్ర॥ మదనుఁడు చంద్రహాసుఁడు ]

మదన—విషయా! ఇంకరమ్ము వాసంతికా! చంపకమాలినీదేవి లేదాయె.

[ పునః ప్ర॥ దాసి. ]

దాసి—వాసంతికాదేవి! చంపకమాలినీదేవి శిరోభారమువలనఁ బండుకొనియున్నది. నన్ను రమ్మన్నది.

మదన—మన మందఱము పోవుదము. చంద్రహాసకుమారా! ఇంత గాఁ ప్రశంసించి వ్రాసిన మాయయ్య లేఖయేయుండ నేలింకొకటూడ నేల! ఈజాబున నతఁడుఁ "భూమ్యాన్యోజన యుక్తముగా విషయను నీకొసఁగుమనియుఁ దడవు సేయవలదనియు" వ్రాసినాఁడు ఈరాత్రియే లగ్న మేర్పఱచి ససాకల్యముగ నుద్వాహమహోత్సవము నెఱవేర్తు వాఁడ. ఇప్పుడే యీవనదేవత యెదుట మాజనకునాజ్ఞచొప్పున నీవిషయాతలోదరిని నీకొసఁగువాఁడ. (చేయిచేయిఁ జేర్చును.)

అందఱు మంగళము పాడుదురు.

తృతీయాఙ్కము-సమాప్తము.

—:o:—

శ్రీ

# అభిజ్ఞానమణిమంతనాటకము.

## చతుర్థాఙ్కము-ప్రథమరంగము.

### కుంభీనసునియిల్లు.

[ ప్రవేశము. కుంభీనసుఁడు. ]

కుంభీ—ఏమిది! త్రోవనెందఱో బ్రాహ్మణులు నన్నుఁ జూచి పరమసమ్మోద మారఁ దీవన లిచ్చుచు వచ్చిరి. ఇంటికివచ్చి చూతుఁగదా పెండ్లిపందిళ్లు వేయఁబడి గృహమంతయు నలంకారయుక్తమై పచ్చతోరణములు గలదియై యున్నది. పోయినపిదపఁ దానే తెలియఁగదాయనియు నెవరిపెండ్లియని నేయడిగిన కాకఁదెలియకయే పెండ్లి జరిగినదాయని యితరులనుకొనుట యేలయనియు నొకరిని నేనడుగకపోయితి. తెల్లవాఱి యున్నను నింటనొక్కరు లేకున్నారు. ఏమిచిత్రమో!

(ప్ర॥ మదనుఁడు.)

మదనా! రమ్ము. కూర్చుండుము. నాజాబు ముట్టెనా?

మదన—నాఁడే ముట్టెను.

కుంభీ—దానియందు నేనాజ్ఞయిడిన తీఱువ నొనర్చియున్నావా?

మదన— అభ్యంతరముగలదా? వీసమంతయుఁ దక్కువగాకుండ జరపియున్నాను.

కుంభీ—ఆజాబేమి చంద్రహాసునకంటెముందే వచ్చెనా? వెనుకనా?

మదన—ఒక్కనాఁడే జంద్రహాసుఁడును జాబును వచ్చినది.

కుంభీ—ఆజాబునందలి కార్యమెప్పుడు జరిగెను?

మదన—నాఁడే. నాఁటిరాత్రియే జరిగినది.

కుంభీ—దానివలన నూరిలో నేమైనఁగలకల మాయెనా? లేకయూరకె నెమ్మదిగనే ముగిసెనా?

మదన—ఊరిలో నసాధ్యకోలాహలముగా జరిగినది.

కుంభీ—నన్నెవ్వరైన సంశయించిరా?

మదన—సంశయించువారెవ్వరు? అందఱు ప్రశంసించువారే.

కుంభీ—ఇంక మనకు నిర్భయముకదా?

మదన — ఈషన్మాత్రమును భయములేదు. మీయాజ్ఞకేమైనఁదిరుగు బాటుఁడినఁగదా?

కుంభీ — ఈపెండ్లి పందిలి యేటికి?

మదన — ఇదిలేకున్నఁగార్యమెట్లు జరుగఁగలదు?

కుంభీ — ఆహా! పెండ్లినెపమున నాపరికాఁజేసితివో? హా! చంద్రహాసుఁడేమైనఁ గటకటపడెనా?

మదన — అమ్మో! ఇట్లేలపలికెదవు? వానియానందము మిన్నుముట్టినది.

కుంభీ — అయినఁగొనవలెను నట్లే యానందమునను౦డెనా!

మదన — కొనవలెను నెందుకు? ఇప్పటికిని.

కుంభీ — ఇప్పటికిని! ఇప్పుడువాఁడెందున్నాఁడు?

మదన — నిద్దురపోయియున్నాఁడు.

కుంభీ — లేవని నిద్రయేకదా?

మదన — అయ్యో! నీకెందుకు కోపము? పెండ్లి సందడిని గాత్రియంతయు నిద్రలేదు. ఇప్పుడింకను సూర్యోదయమైనను గాలేదు. ఇంతలోననే లేవవచ్చును నేను మేలు కొల్పింపుదునా?

కుంభీ — ఎవరిని?

మదన — అదేల యిట్లడిగెదు? ఎవరిని? చంద్రహాసుని.

కుంభీ — ఏంటున్నాఁడు?

మదన — ఇంకెందుండఁగలఁడు? పడకటింటియందు.

కుంభీ — ఏ పడకటింటి యందు?

మదన — నీకేమి భ్రాంతి? విషయపడకటిల్లు గాకయింకే పడకటిల్లు? నాచెలియలిని వానికిచ్చి వివాహము చేయుమని జాబువ్రాసియుండి యిట్లడుగ నేమికారణము?

కుంభీ — ఆజాబు నీయొద్దనే యున్నదికదా?

మదన — ప్రాణపదముగాఁ బదిలపఱచియున్నాను. అందేమైన సందేహమా?

కుంభీ — (నవ్వి) సందేహ మేమియు లేదు. నాకు దానిందెచ్చియిమ్ము.

మదన — నాయొద్దనే యున్నది. కైకొమ్ము. (ఇచ్చును)

కుంభీ — (దానినిఁజదివి) మదనా! ఇదిసరియే. దీనియందేమియు సంశయము లేదు. ఇప్పుడు వివాహమై యెన్నిదినములైనది.

మదన — నేటికి నెనిమిది దినములు కాలేదా?

కుంభీ — సంతోషము. నీకింకను నిద్రవచ్చుచున్నట్లున్నది. నాకును నిద్రవచ్చుచున్నది పండుకొనుము. పొమ్ము.

మదన — భాగ్యము. (నిష్క్ర-మి)

కు. భే — హా! హా (అధోముఖుడు మోదుకొని) నామాలదైవము నాకింత భంగపాటుకలిగించునే! కట్టా! ఇట్టొవలి నేనొకనాఁడుం దలఁపనైతిఁగదా? నాలుగేండ్లబాలు నా క్రూరకర్మునకుఁ జంపుటకు వేన వేలుద్రవ్యమిచ్చితి. ఆదురాత్ముఁడగు నఘోరుఁడుబోటవ ప్రేలితోఁ బరసమాప్తి యొనరించె. నేనే యాచందనావతిలో వేషము వేసికొని యెక్లైనను కానిమ్మని వానిపై నమ్మి వేసి వెంటనే యాధనువును జెఱువునఁబడవైచితి. కాండీరులలో నాయట్టికృత పుంఖుఁడుగలుగఁడని యున్న నాయాహా పౌరుషిక యంతయుఁగడఁజేర గొంతునకు వేసినయమ్ము చెవికిఁదగులునట్లు పదార్థప్రపత్యుఁడ నైతి. ఆభటానములనుఁజిక్కి గుఱితింపఁబడి ప్రాణములెట్లో తప్పించుకొంటిని. ఇప్పుడు ఖండితముగా నాచెవులార యాదుర్బీజుని చావువిందనని వచ్చి, వాఁడునా కల్లుఁడైన దుర్గతికి నాటపట్టైతి. నాయట్టిహతభాగ్యుఁడుండునే! ఏదుర్భ్యజూఁడి జాబు నిట్లు దిద్దియున్నవాఁడు? అక్కటా! రెండు మూఁడక్షరములు మాత్రముమాఱ్చి జాబునంతయు విపరీతార్థముగా నొనర్చి యున్నాఁడే? ఏమాశ్చర్యము? నాపాదు చేతులకట్టి శబ్దములేల రావలయూ? విషము నొసంగుమనుట కంటె గరళము నొసంగు మనియు, ప్రాణపీడన కార్యమనుటకంటె, సంహారణోద్యోగమనియు, ఉద్వాస మనుటకంటె మారణమనియు నేల వ్రాయనైతి? ఇదియంతయు. దైవాయత్తముగదా? ఇట్లు కానున్నది వేఱుభంగి నెట్లగు?

శా. భావం బెవ్వరెఱుంగరాని కరణిం భంజంతుఁ బ్రత్యర్థినిం
తేవిద్యాంసుఁ డనంచు నెంచితిఁ బరాధీనుండగా నెన్నఁడున్
ధీవైయర్థ్యతనేఁడు నాకొదవె సాధింపంగలే నైతిఁగా
దైవాధీనతయింత చేకురెమదిన్ దర్కింప నింకేటికిన్.

అక్కటా! నాకడుపున దావాగ్నిపుట్టె. మూఁచినఁ దెగటార్పనున్న యాజన్మశాత్రవుని నాయల్లునిఁగా నింకెట్లు పూజింపగలను? ఈజాబునిట్లు కల్పించినవాఁడైన నెవరు? నాకుఁజూడ జంద్రహాసుఁడో, ఈదురాత్ముఁడగు మదనుఁడో, లేక యేమైన విషయ హృదయమగు విషయయో, కాదేని నాకొడుకుంగోరని యాచంపకమాలినియో యుందురు గాక వేరెవ్వరికీయాస్థ? ఇంకను విచారించి చూచెద. ఇంతలో విడిచితివా? నన్నుఁ గాలనలచి నేలరాచుచున్న నాదష్టదైవము నేనేపాదతాడనం బొనర్పఁజాలనా? కానీ! చూతము.

## అనుబంధము 34.

అదే! యారాజహతకుఁడగు చంద్రహాసుఁడియ్యెడకే వచ్చుచున్నట్లున్నది. ఈదుర్బీజుఁడు చచ్చియుండునని నమ్మి యాకులిందకుని రాజ్యచ్యుతునిఁజేసి యందు మాప్రతినిధి నుంచి వచ్చితినే! ఈ వృత్తాంతమునకు వీనికే యుత్తరమివ్వగలను?

[ ప్ర॥ చంద్రహాసుఁడు. విషయ. ]

చంద్ర } విషయ } (కుంభీనసునకు నమస్కరింతురు)

కుంభీ — చంద్రహాస కుమారా! తనయా! విషయా! లెండు. (ఆలింగనము చేసికొనును)

చంద్ర — మామా! మంత్రిసత్తమ! నాపైఁగలప్రియ వ్యాజకమున నే నేమని కొండాడు దును? ఎన్ని జన్మములెత్తినను నీ ఋణము నేఁ దీర్చికొనఁజాలువాఁడనా? ఆజన్మ కృతజ్ఞతా సూచకములగు మన్నమస్కృతులఁ గైకొనుము.

కుంభీ — కుమారా! నీయట్టివాఁడు నాజామాతగాఁ గలుగుట నా భాగ్యమునఁగదా, నా దైవము నేన నుతింపవలయుఁగాక, నీవు నన్నుఁ గొండాడ వలయునా? తనయా! విషయా! నీకనురూపపతి నెందుఁ గానకయున్న వారిలో నింత వయసు చెల్లినదాని నేనాఁడు ప్రస్తావించిన నంతాగ్రహముగ మాడలాడితి వే! ఇప్పుడైన నీకు సంతోషము కలిగెనా?

విషయ — అయ్యా! కన్నతండ్రివగు నీవునన్నట్లు త్రోయుదువా! వేడుకకట్లంటివి కాక. నీయాజ్ఞ యొనర్చుటకంటె నాకుసంతోషము కలుగునా?

కుంభీ — కుమారీ! నీమగనితో నేనంతరంగమున కొన్ని మాటలాడవలయు. నీవంతఃపుర మునకుంబొమ్ము. తరువాత నీతోడను కొన్ని మాటలాడవలయు గమ్ము.

విషయ — (నిష్క్రమించును).

కుంభీ — కుమారా! ఇప్పటికి నామనసున నెన్నఁడులేని యానందము గలిగె. నీతోడ నీవృత్తాంతము చందనావతిపురి నేఁదొల్త చెప్పకుండినందునకును, నామనస్సంతోష మొదవింపఁగల నీవివాహమునకు నేను రాకుండుటకును క్షమింపుము. మఱియొక మాట నీవు చందనావతినుండి వెడలివచ్చితివిగదా? నేనందు విచారించితి. ఆనాఁడా వాసుదేవదేవాలయమున కుత్సవముతో నీవు పోవుచుండిన కాలమున నీపై నక్షు వేసిరి గదా వారిని గుర్తించితి. నీయానవచించెదను.

అనుబంధము 35.

నీతండ్రియని పిలిపించుకొనుచున్న కుళిందచండాలుఁడున్నాఁడే. వాఁడే యాకార్య మొనరింపించినది. దుష్టాంతయుక్తముగ నీవృత్తాంతము వెలికి వచ్చినవెంటనే యాహతకుని రాజ్యచ్యుతునిఁ గావించితి.

చంద్ర — హా! దైవమా! (మూర్ఛ.)

కుంభీ — (ఆలింగనముచేసికొని సేదఁదీర్చి) కుమారా! కుమారా!

చంద్ర — (లేచి) హా! హా! (యని ముఖముమొమొదుకొని) శ్వశురా! నిన్నెంతపూజనీయుఁ డని యెంచితి. ఎంత నీకుకృతజ్ఞుఁడుగా నుండఁగలవాఁడనని భావించితి? అయ్యయో!

ఏమికార్యముఁ జేసితివి? నాకెంతపాపము వినిపించితి? అక్కటా! నాతండ్రియే నాలుగేండ్ల బాలుఁడగు నన్నుఁ బెంచి పెద్దచేసి కాపాడినతండ్రియే? కన్నతండ్రి నరయనేరకున్న పరాచితుఁడను గన్నతండ్రికంటె నెక్కుడు మన్నించినపెంపుడు తండ్రియే? అతఁడు ననుఁ జంపఁగోరెననుట నీవెట్లు నమ్మితివి? చంపవలసియుండెనా-చిన్నఁనాఁడే యట్లుగొంతుపిసికి మృతికలిగించియున్న నతనికడ్డమా? నీవు నాకువలగని యతఁ జూడియుండిన నతనిచరణముల సన్నిధి నాతలగోసియిడుచుంటి నే? అట్టినానినా నీవిట్లొనర్చితివి? ఇంతఘాతుకకృత్యమొందైనవువింటి మే, దురాత్మా! నీవు నాకు మామవైనకతమున నియ్యెడ బ్రతికితివి గాక, ముంగొడ్డైయుండిన మొండెమేర్పడుచుండె. నీవు నాశ్వశురుఁడవా శాత్రవాగ్రసరుఁడవు గాక? ఛీ! ఏమి సంతోషముని యానీచవాక్యము నాడసాగితివి? ఇదేపోయెద. సంసంధి గ్రామమునుజించి చెండాడి ధూళిపటలముగావించి ననుఁ బ్రేమించుతండ్రినిఁ జెఱ విడిపించెద.

శా॥ హేతిప్రక్రియలోక భీషణముగా నీమండలాగ్రంబునా
చేతంగల్గఁగలోకముల్ గలఁగవే చేసేతఁ బత్యర్థిసం
ఘాతంబుండనుమాడి మాజనకునిన్ గారుణ్య సంయుక్తునిన్
బ్రీతస్వాంతునొనర్చెదన్ యశమొగిన్ బృథ్విస్థలిన్నించెదన్.

అక్కటా! నీవిషయము నాకొసంగి పుణ్యముఁగట్టికొన్నవాఁడవని యెంచితిఁగాక యిట్టివిషము నొసఁగిల పాపాత్ముఁడవని యెఱుఁగనైతి. ఇదే పోయెద-నిదేపోయెద.

(అని పోవఁబోవ)

సంఘ—(చంద్రహాసు నాలింగనము చేసుకొని) కుమారా! ఇట్టిపరితాపము నీకుగలిగించువాఁడనని యెఱుఁగనైతి. సదుద్దేశమున నీమేలుకొఱకని యొనరించితిఁగాక లేకున్న నీకింత సౌఖ్యమునొసంగి నాయల్లునిఁగా జేసికొనఁ నెంచి నీకపకృతిఁగా వింతునా?

సీ॥ చందనావతినీకు చరితంబు వినినంత కరుణ
చూపినభంగి యరయవలదె
వినినంతనేనాడు తనయునకొక కమ్మయకట
పంపినరీతి యరయవలదె
నిను బాలిశులు ఘాణమున వైచినపుడు
నే నడలిన పగిదియింతరయవలదె
నారాము తనయునీదారగాఁజేయుయనుదా
రవైఖరి యింతయరయవలదె

తే॥ గీ॥ యింతయును జూడ కిటులాడ నెంచినాఁడ
వకట యీజాడన కేడ యనఘుపీడ.
వలదెసేఁ వాడఁ గొనియాడ వలయువాఁడ
గాంచె నేడ నఘమేడ కడి ద్రిపోడ.

నీ యేలుఁబడి చల్లని యేలుబడియని జనులందఱు నినుఁ గొండాడ నసూయతోడ నిన్నుఁ గనని తండ్రి గావున గుళిందకుఁడ కార్యమొనర్చియుండిన నుండవచ్చునని నమ్మితి. నీవు ధనువేల పూనవలయు? నీకు శత్రువు లెవరున్నారు? ఇదియంత నీకహితముగు భంగి యైన నంతయేల నేనే రాజేంద్రునొద్దకుఁబోయి ప్రత్యక్షమైగైకొనివచ్చెద.

చంద్ర—హామ్మ-హామ్మ-తొలుతఁబొమ్ము. పోవకున్న—

కుంభీ— (శీఘ్రముగ నిష్క్రమి.)

చంద్ర—హా! దైవమా! (మూర్ఛిల్లును.)

(యవనిక దిగజారును.)

—(౦)—

## చతుర్థాంకము-ద్వితీయరంగము.

### కుంభీనసుని యిల్లు.

[ ప్ర॥ కుంభీనసుఁడు బిందోజి. ]

కుం—బిందోజీ! కాలసర్పములంత క్రూరములా? వాని నాకుఁ దెచ్చి యివ్వఁగలవా? నేనొక మహౌషధమునకై వానిఁ బట్టదగియున్నది.

బిందో—వలసియున్న నీకొఱకు ఈ సంధ్యవేళకే యట్టివాటిని పదింటినిఁ దెచ్చి యివ్వఁగలఁడు. విషముతీసియేకదా తెచ్చియియ్యవలయు?

కుం—విషముఁ దీసినపిదప నౌషధమున కేమిప్రయోజనము? పూర్ణవిషములగునవియే కావలయు.

బిందో—ఆహా! అట్టివాని నేనెట్లైనఁ దెచ్చి యివ్వఁగలనుకాని నీవెట్లుపట్టియుంచెదవు?

కుం—ఒక సంచిలోనుంచి యుందునని చెప్పితినే? అట్లొనర్పరాదా?

బిం—ఉండవచ్చుగాని వానిని వెలికిఁదీయుటయే యసాధ్యము మూతివిప్పిన వెంటనే యడ్డమువచ్చినవారిఁ గఱచిచంపును,

కుం.—అట్లుకాదు నేనొకగదిలో నిండఁగడిచేసి యాగండియందు దాఁచినుంచి వెనుకటి సూత్రములనీడిచి లోపలికిఁ ద్రోసి భస్మము చేసెదను.

బిం.—అంతరేల? నేనే వలయునన్న వానిఁదెచ్చి నీయిష్టమువచ్చినచోట వైచెదనే?

కుం.—అట్లయిన యోచనయుండెనా? అదియొక కాలము గుఱుతించి పక్కముచూచి యెవ్వరు నెఱుంగకుండ చేయవలయు.

బిం.—అట్లయిన దేవరచిత్తము. నేనేమోస్వామి యూన జరుపువాఁడను. దానియందపాయమైన నేను తగవాదినిగాను.

కుం.—ఆవిషయమున నీవేమియు భయపడవలదు. నాకు మాత్రముభయములేదా? పోనీ! బింబోకీ! అట్లు గండిలోనుండి వేసినకాలమున నాగదిలో నెవ్వరైన మనుష్యుడున్న నెట్లు?

బిం.—అయ్యయ్యయ్యయ్యయ్యయ్యయ్యో! బ్రదుకునా?

కుం.—కాఁబట్టి మిక్కిలి జాగరూకతతో చేయవలయుఁగదా?

బిం.—అట్లుగవలెనా? మఱి నేను పోయివత్తును. మీకీసాయంకాలమునకెన్ని కావలయు?

కుం.—నాలుగింటికిఁ దక్కువ లేఁడ కావలయు. సాయంకాలముకే. కావలయు మఱువకుము తప్పకుము.

బిం.—అయిన పోయివత్తును. (నిష్క్ర-మి.)

కుం.—ఇంక నాగిండ్రహాసుఁ డెక్కడనుండునో చూచెద. అహో! నాయల్లుఁడే. బిడ్డమగఁడే. వాఁడుపోయిన నాబిడ్డ విధవయగునే. ఆ దుఃఖము కలకాలము చూడవలసి వచ్చునే. దీనికేటు చేయవలయు? ఊహూఁ నేవినను. నేవినను. ఓయంతస్సాక్షీ! నన్నిట్లేల కళవళింపఁజేసెదవు? నాపట్టినపట్టువిడుచుట నాజాతకమున వ్రాయఁబడనేలేదు. ఈ మణిమంత్రుఁ బోలిపుచ్చుటకుఁ గంకణముపూనితి. అఘోరుఁడు కృతఘ్నుఁడయ్యె నాశరలక్ష్య మసార్థకమయ్యె. కొడుకు శత్రువయ్యె. అయినను మించిపోయినదేమి. అవశ్యము నాప్రతిని నెఱవేర్చెద. విడువను-విడువను. అల్లుఁడు! అల్లుఁడు! కనలేదు-పెంచలేదు. అరణ్యమునఁబోయెనఁటె నఱుకఁబడియుండెనఁట తాఁదెచ్చి గొన్నాళ్ళు సంరక్షించెనఁట-అట్టిళిందకుని లేని యభిమానముపూని వానిఁ జంపను లేదు-నఱుకను లేదు. రాజ్యచ్యుతునిఁ మాత్రమొనరించినంతనే పూజనీయుఁడ నైశ్వరుఁడనైయున్న నన్ను నీచాతినీచములగు నిష్ఠురోక్తులాడినవాఁ డల్లుడా? నిష్కారణుఁడగు భిల్లుఁడుగాక. వానికై యింకేల చింతింపవలయు? బిడ్డ! మంటిగడ్డ! ఎట్లును నేను దానినొకవృద్ధకులటా సుతునికివ్వ నెంచియుంటి. అచిరకాలమునకే విధవగా నొనర్ప నెంచియుంటి. ఇప్పుడునట్లే కాఁగలదు. లోపమేమి? అదిగాక నేవిచారింప నీదుర్జాతియే నాజాబును మార్చినదనుట రూఢమయ్యె. "ప్రాణపీడన

మని" నేవ్రాసినందున "బాణిపీడన"మని మార్చఁబడి యుంగదా? యాణికారణమునందు గుడి (ఇత్వము) దాని చేవ్రాలు పోలిక నేయున్నది. జనకుఁడను పక్షపాత మింతైన లేక జాబువిచ్చి యనర్థగమాఱ్చి యాజనకునాజన్మవిరోధిఁ పలుగాకిఁదాఁ జెప్పె యాడునే? ఇంత యసదృశాద్భుత పాండిత్యమునకా రిక్కసి విధవయే కాఁదగి యున్నది. కుంభీనసా! నీవింకనల్లుడను నామమును దలంపకుము. బిడ్డయను నభిమానము నెక్కరానీయకుము. విడువుము విడువుము. కరుణయను పదార్థమే యెఱుఁగని నీకిప్పటికి గరుణఁపుమాట. కట్టితివి సీమసీమల నీవిజయతోరణముల. కొట్టితివి పరిపంథిస్తోమమహాగుపట్టి. మెట్టితివి రాజాధిరాజుల కిరీటములపై ధీవిశేషసంభావనీయముగా నీచరణయుగళము. పట్టితివి వీనినెట్టిభంగినైనఁ జంపుటకు ఘోరప్రతిజ్ఞ. ఇంక శంకదొట్టనేల? వేఱుమది పుట్టనేల? దైన్యముఁ దట్టనేల? నీవకరుణ చూపట్టనేల? ధీరత పోఁదట్టనేల?

తే॥ గీ॥ తనయుఁడగుగాక తగుఁగాక తగదుగాక
సమయమగుగాక చనుఁగాక చనదుగాక
దుఃఖమగుగాక దురితంబు దొడరుగాక
వీనిఁజంపక విడువ నేవిడువ విడువ.

ప్ర॥ చంద్రహాసుండు.

కుంభీ—కుమారా! చంద్రహాసా! (ఆలింగనమునఁ జేసికొని) రమ్ము. చూడుమిదె నీతండ్రిని మరల రాజ్యపట్టమున నునుపనొసగిన రాజశ్రీముఖము. (ఇచ్చును).

## అనుబంధము 36.

చంద్ర—(చూచి) శ్వశురా! నీకారుణ్యభావము నింతని పొగడనేర్తునే? కాలబలమునను బితృభక్తివిశేషమునను నిరుద్దేశముగా నేనొర్చిన సర్వాపరాధములు క్షమింపవలయు. (నమస్కరించును).

## అనుబంధము 37.

కుంభీ—కుమారా! లెమ్ము. లెమ్ము. నీయెడనా నాకుభేదబుద్ధి? నీదుఃఖము దప్పనాకు వేఱొకదుఃఖము గలుగునా? క్షమాపణము నడుగవలసిన వాఁడ నేఁగదా? నిన్నింత వంచినందుకు.

చంద్ర—జనకా నాకిప్పుడే యాజ్ఞయిమ్ము. అశ్వారోహుఁడనై నేనేపోయెద.

కుంభీ—పుత్రా! అంతనీకేలతొందర? నీధీరవచనము నాలించిన వెంటనె రాజశ్రీముఖము వచ్చుటకైనఁ దడవగుఁగా యనినేనే యందున మాప్రతినిధి కాజ్ఞాపత్రము వ్రాసియొక పాదితోనుదయముననె పంపితి. ఇప్పుడిదియును మఱియొక యాశ్వికునితోఁ బంపెద.

చంద్ర— మామా! అంతయేల? నాకేమియు శ్రమగలుగదు. నేనేపోయెద,

కుంభీ— కుమారా! నామాట పాటింపుము. నీకింత మనస్తాపము గలుగుటకుఁ గారణము నిప్పుడు తెలిసితి. మాయింటఁ బెండ్లియైన మూఁడవనాఁడుగాని తుదకు పదిదినముల లోపలఁగాని యూరవెలినున్న దుర్గాలయమునకు రాత్రి పదిగడియల కిదపఁబోయి ప్రదక్షిణత్రితయమొనరించు సంప్రదాయము. నేనిన్నుఁ జందనావతినుండి పంపునప్పుడు దీనిఁ జెప్పుటకు మఱచితి. ఇదిమొనర్పమింజేసి నీకీదుఃఖము పొందవలసెడి. మీతండ్రికై నీవింతైనఁ జింతింపకుము. నేఁటికే నీవివాహమై తొమ్మిది దినములైనవి. ఈ రాత్రి యా సంప్రదాయవిధి యొనర్పుము. అది మహాకఠినకార్యము. దానికెన్నియో యంతరాయములు గలుగు. ప్రదక్షిణ కాలమునఁ బెద్దపులులు వచ్చినట్లు, పాములు తేళ్లు కనుపించినట్లు, నేమేమో భయంకరవృత్తములు జరుగును. వానినరకుగొనక తెలివేర్ప వలయు. ఈ రాత్రి యీ కార్యమొనర్చి రేఁపుదయమునకే వలసియున్నఁ బోయెదవు లెమ్ము. అయ్యో! కుమారా! నీవిప్పుడు పోయిన మా ముద్దుకూఁతురు నీవియోగము నెట్లు సహింపఁగలదు? ఆతనయతో మహోత్సవమున నీపురస్సరముగ మీటికి మరలు పెండ్లి యొనర్చుటమాని నిన్నొంటిగాఁబోవనిత్తునా? ఇంకను సంగతుల వచించెద. నిల్చురమ్ము. (నిష్క్ర—౨).

———(o)———

2

## చతుర్థాఙ్కము-తృతీయరంగము.

### సుదర్శను నంతఃపురము.

[ ప్ర సుదర్శనుఁడు చంపకమాలిని వాసంతిక. ]

సుదర్శన—తనయా! చంపకమాలినీ! మనమానాఁడు వనభోజనమునకుఁ బోయియున్న నాఁటినుండియు నీచంద మొకవిధముగానున్నది. చెలికత్తియలతోడను జనకులగు మాతోడను జక్కఁగ మాటలాడవు నిద్రయింగూరక కలవరించెదవు. నిన్న మీజనని నిన్నెంత గ్రుచ్చిగ్రుచ్చి యడిగినను జెప్పవైతివఁట.

### అనుబంధము 39.

అయినను నేనుఱింపియున్నవాఁడ. కుమారీ! నీకు మిక్కిలి యౌవనముగ్ర యొడఁబాయ కుండిన నీవిషయ యానాఁడే వివాహిత యగుటంజేసి నీయొద్దకు రాకున్నం దున నీవనట్లు వివాహమేల కాలేదని కదా యోచింతువు! నిక్కము వచింపుము.

చంపక—జనకా! నాకాచింతయేమియు లేదు. ఆ నాఁడడవిం దిరిగినందున నింతయా సమై యింతకు దగ్గుచున్నదిగాక యొండొకటి కాదు. నావివాహమునకై నాకుఁజింత యేలికిఁ గలుగు? ధరాభార మంతయు మోసియున్న నీయట్టి ప్రేమనుడించు తండ్రి యుండ నాకట్టిచింతకలుగునా? నావివాహము నీవెప్పుడుతలఁచినఁ గాదు?

వాసంతిక—మామా! నే వచించెదను. చంపకా! నను గోపగింపకుము. మామా! నీవన్న మాటయే సత్యము ఆవిషయమునన్యాహానసగుటచే నీకన్నెకాతిలఁపు పుట్టి యిట్లయినది.

చంపక—మంచివినోదమాయెను లేవే. నీతోనేఁ జెప్పకొంటినా?

వాసం—ఇంకూరకుండుము. మా మామ యెంతయో విశ్వాసముగా నడుగుచున్న నిప్పు డేల దాఁచెదవు?

సుదర్శ—వాసంతికా! నీవు నిక్కము మాడితివి. పుత్రీ! నే నేమిచేయఁగలను? మా మణి మంతుని కై యన్నిదినములూరకుంటిఁగాక కాకున్న నిన్నిదినములు నిన్నవివాహితఁగా నుంచియుందునా? ఆప్రాప్తము నాకులేదు. పదునైదు, పదునాఱు వత్సరములయ్యె వానిపాలకువయే కానరాలేదు. ఇంతవఱకు లేనియాశలు కల్పించుకొనుచుంటి. మొన్న కేరళ బ్రాహ్మణుఁడు వ్రాసినజాబునై నింక నిరాశయాయెను. చెంచువానితో నీపదు నైదు వర్షములు నూరూరు తిరిగెనఁట. వాఁడు తుద కఘోరుండను బోయవానిఁ జూపెనఁట వాఁడో యెంతబాధించినను దనకేమియుఁ దెలియ దనుచున్నాఁడఁట.

ఆలోచించువాఁడే పాఁడవడియెనో కాకదేశము దిరుగఁ జాలక విసిగి యెవ్వనినో యొక్కనిఁ జూపెనో యేమిగతియో తెలియకున్నది.

వాసం — మామా! మా కేంశ. బ్రాహ్మణుఁడు వారినిబిలుచుకొని వచ్చెదనని కదా వ్రాసెను.

సుద — అప్పుడు మొన్న యుదయముననే రావలసియుండె. ఇది వఱకు రాలేదు. ఏమయిన ఫలమున్నఁగదా వచ్చును.

చంపక — జనకా! నాకొఱకై యెంతయో వగఁజెందితివి. హతభాగ్యురాలగు నాకు నామణిమంతుఁ డెక్కడ లభింపఁగలఁడు? (దుఃఖించును).

అనుబంధము 39.

సుద — పుత్రికా! దుఃఖింపకుము. ఎప్పుడో యాశవిడిచిన వానికిప్పుడు దుఃఖించియేమి ప్రయోజనము? మణిమంతుని భాగ్యమిట్లయ్యె. వాసంతికా! శోకింపకుము. ప్రయోజనమేమి? మణిమంతుని భాగ్యమిట్లయ్యెఁగదా? ఇంకెవరినైన వరయుదము. కుమారీ! నీమనసునకు వచ్చువాఁడెవఁడైన నున్నాఁడా?

చంప — అయ్యా! నీమనమున కెవఁడు వచ్చునో యతఁడే నామనసునకు వచ్చువాఁడుగదా?

సుద — పట్టీ! మన కుంభీనసుని కుమారుఁడు మదనుఁడెట్లు?

వాసం — (తలవంచును)

చంపక — రామ! రామ! అయ్యా! ఆమాటనకుము.

సుద — అమ్మరో! ఇదియేల?

చంపక — అయ్యా! చెప్పవలసివచ్చినందునఁ జెప్పనేవలయు తండ్రీ! నీవు నాపైఁ బ్రేమగలవాఁడవనుట కెన్నియో దృష్టాంతములు కలవు? ఇప్పటి నామాటజరుపుదువేని యిది యెక్కుడగు దృష్టాంతము. ఆమదనుఁడు నాతోడఁబుట్టువుగా భావింతు. నాయనుంగు మఱఁదలీవాసంతిక వానియెడఁదప్పని పతిభావము వాటించియున్నది. ఆమదనుఁడును వాసంతికయే తనభాగ్యలక్ష్మిగా భావించియున్నాఁడు. ఇంకేమి కావలయును? నీయానతి యొక్కటియేకదా? నావివాహమునకై యోచింపకుము. నీయిష్టము వచ్చినప్పుడు కాఁగలదు. పుత్రినగు నాయెడ నీకు నిక్కంపు కరుణ గలదేని యీ వాసంతికా పరిణయమున కానతీయవలయునని యత్యర్థము విన్నవించుదానను. (నమస్కరించును)

వాసం — (లజ్జించును).

సుద — (వాసంతికయెడను-జంపకమాలినియెడను చూచి) తనయా! లెమ్ము. నీవింత ప్రార్థింపనేల? ఈ మదన వివాహమునకుఁ గుంభీనసుఁడొప్పనున్నాఁడా?

చంప — విషయను-జంద్రహాసున (గుటికలు మ్రింగి) కిమ్మని మదనునకు వ్రాసెనని నేఁ జెప్పియున్న యాబాలునందే దీనికి సతఁడంగీకరించి యున్నాఁడు.

సుద — అట్లయిన మిక్కిలి మేలయ్యె. నాకుఁ బరమసమ్మతమగుఁగదా? తనయా! నీ యభీష్టము తెలియఁజెప్పుట? త్వరపే వివాహప్రయత్నము లొనరించెద.

వాసం — మామా! పుత్రిపైఁ గరుణఁ గలుగుట నీ కబ్బురము కాదు. నైజమే. చిన్ననాఁటినుండి తలిదండ్రుల నెఱుఁగక నా తల్లియుఁ దండ్రియు దైవమును నేనుగడయు నీవే యని భావించియున్నదానను. పుత్రికంటె నన్నెక్కువగా మన్నించి పెంచి రక్షించితివి. నీ పుత్రి యభిలాషమైన నొకప్పుడు నీవు తీర్పని యున్ననియుందువు గాక నాకుఁదీర్పని యభిలాషమే నీకుఁ గలుగదు. అట్టి నన్ను వ్యాజ కరుణచే నీ వాఁడు మనస్సిద్ధి కలిగించితివి.

అనుబంధము 40.

ఈ సంతోషసమయమున నే నిన్నొకటి యడుగుదును నీ వవశ్యము తెలిపెదవను విశ్వాసముననే యడుగ సాహసించెదను. నా యనుంగు నీ చంపకమాలిని మనసు హరించిన వాఁ డీయూరనే యున్నాఁడు. మా యింకొక యనుంగు విషయను పాణిగ్రహణ మొనర్చి యన్వర్థాభిధానమగు చంద్రహాస నామము వహించియున్నవాఁడు. పుత్రి యభిలాషము నిండింప నను గాపాడిన భంగి నా యభిలాషము నిండింప నీ పుత్రి నింత రక్షింపుము.

సుద — (ఆశ్చర్యమున) తనయా! నిక్కమా!

చంపక — (లజ్జించుచు).

సుద — అమ్మగో! నీకట్టి యభిలాషమా! కృతసాపత్నికమై యా విషయయుండ నీవు భోగినీత్వమున కియ్యకొందువా?

చంపక — జనకా! ఇంక నీ యెదుట నామాటకు సిగ్గేటికి? నీవు విషయ వధూ్యధాత్వము సిద్ధించుటను శంకించిన మాట వాడితి గాక వర వైలక్షణ్యమునను శంకింపనైతిని. ఇంతియే చాలు. ఆ విషయయు నేను బరమాప్తలము. ఆ మనోహరునకై దాని దాసియని పించుకొనఁజాలుదు. అందున్న చరిత్రము కడువింత. ఆ చంద్రహాసుని దొలుత మోహించినది నేను. అతఁడు తొలుత మోహించినది విషయను. మాలో నెవ్వగఁ బిన్నయన్నను గావచ్చును.

సుద — తనయా! మీ యిరువుర వృత్తాంతములు వింతలుగా నున్నవి. మీ యభిలాషముల దీర్చుటకంటె నాకు వేఱు కార్యము కలదా? అయినను మీ జననితో మాటాడి వత్తును రమ్మ. (నిష్క-9)

క॥ ఏకాంగాన కొందు మిమ్ముం
దడయక నేఁ జూతు నాదరధననిధులనుచుం
ఊడుగని మీ యభిలాషమె
కడు నా యభిలాషమయ్యెఁ గామినులారా!

—: చతుర్థాంక సమాప్తము :—



# అభిజ్ఞాన మణిమంత నాటకము.

పఞ్చమాఙ్కము-ప్రథమరంగము.

సుదర్శనునంతఃపురము

[ప్ర॥ సుదర్శనుఁడు కేంకి బ్రాహ్మణుడు. చెంచువాఁడు.]

విషయాద్యంతఃపుర స్త్రీలు (దూరమున)

సుద—బ్రాహ్మణోత్తమా! మొట్టమొదట నేనేమియు నెఱుఁగనని కూయుచున్న వాని నియ్యేడకుఁ బిలుచుకొని వచ్చినందున నేమిఫలము?

బ్రాహ్మ—రాజేంద్రా! వాఁడు గా కింకొక్కరుండదు మన మణిమంతుని వృత్తాంతము నెఱిఁగినవాఁడు. ఏమిదుష్కృత్యమొనర్చి యున్నాఁడో మాటుపఱచుచున్నాఁడు.

సుద—అప్పుడు మనమింకఁ జేయవలయునుపాయమేమి? విప్రనాయకా! నీవేలపొంవడి యుండరాదు?

చెంచు—జియ్యా! నేనాచెట్టు చాటునున్నపుడీకుఱువలెక్కలు మాటలాడిన జాడ వింటిని. పేరుపిలిచినదియు వింటిని. మఱచిపోయియున్న కతమునఁ దొల్తనుగ్గడింప లేనైతి. పట్టినవెంటనే వీనిపేరుతెలిసె. తెలిసినంతనే యఘోరుఁడనుట మదికివచ్చె. వీఁడుగా కిఁకొక్కఁడుకాడు!

సుద—అయిన నాయఘోరుని బిలిచికొనిరమ్ము.

చెంచు— (నిష్క్ర-మి)

సుద—సేవకా! ఇప్పుడపోయి మాకుంభీనస మంత్రినిఁ బిలుచుకొనిరమ్ము.

(పునః ప్ర॥ చెంచు అఘోరునితో).

అఘోర—సామీ! దండం.

సుద—అఘోరా! కూర్చుండుము. నీ ముఖముచూచిన నీవుసత్యవాది వనుటచాటు చున్నది. ఇయ్యేడనబద్ధములాడినఁ బ్రయోజనములేదు. అఘోరా! నీపుణ్యమగును. నీ చేతులంటి వేఁడుకొందును. ఆమమాయఁడు నీచేతనే చిక్కినాఁడు. నీవే మొనర్చి యున్నను. భయపడక వచింపుము చంపియున్నను జెప్పుమమాత్రముచెప్పితివా

దుఃఖపడకుము. నిన్నాదరించెదను. ఇంకేభంగిగనెట్లొనర్చియున్నను సంతోషమున నీకు బహుమతియిత్తును. నిను వేడికొందు వచింపుమా!

అఘోర—సోమీ! నీవుమాతోకరాయ డున్నట్లుండావు నీయెక్కడ్గా కల్లల్లాడేదిలేదు. మాయబ్బతోడు-నీతోడు-తోకరాయణితోడు. సత్తిగం-సత్తిగం-సత్తిగంచెప్తాను. ఆపాద్దారేతిరికాడ పిండిబోశినట్టు యెన్నెలుండాది. ఎవ్వడోన్యాలి, నల్లగ నెత్యాళ్లు కాణ్ణుంటిశాల్గోరుదంకా నల్లాడం, అంగీ, పైఅంగి, నిండాక రే-క రే-క రె మొద్దాల వచ్చినిల్సుకోనుకోన్ని అగోరా! అగ్గోరా! నన్నుపిలుస్తాడు. పిలుస్తాడయ్యా అంటె. సత్తిగం-సత్తిగం తోకరాయడున్నట్టుండావు, ఏయూరప్పాయంటి. శేతిలో అక్కడయెయ్యిరూపాయలు పోశిండాడయ్యా. పోశిండాడు యెయ్యిరూపాయలు. రుయెయ్యా, మారో, లచ్చి దానన్నాలాయేడకి దెల్సునీ, యిన్నిరూపాయలు పోశిండాడు: మాన్యాస్తగాడెయ్యిరూపాలనె పోశిండాను. యేమిశెయ్యాలేప్పాయంటిని? గుల్లోబుడుతోడుండాను, నతిశెశానొల్తెస్తే యింకానోటిరూపాలిస్తానంటాడు. నేననొక్కంటి! యీగాడ్దులక్క బుట్టిన్నాయాలు బుడుతోణ్ణి నరక్కశే యింతిస్తాడనొక్కంటి. సూస్తివా యెంతన్నపోతి గళ్ళోకి దమ్మంటాడు-పోతి పిల్లోడుండె-యెత్తుకొస్తి-సూస్తి-అయ్యా తోకరాయణితోడు సెప్తాను-అయ్యో-అయ్యో-అయ్యో యెంతముద్దొస్తుణ్ణెయ్యా?

బ్రాహ్మ—చంపితివా?

అఘోర—నిలశ్శి, కుయాకు. ముద్దొస్తుణ్ణేయ్యా! సూస్తి నరక్కశెయ్యాల్లే. నేనూ నాన్యాస్తగాడు మట్లాడు వుంటాంగదా-యీనామ్మనాయాలు యీ శెంచోడు గోణి కేసి గోణికేసి గోణికేశి శెట్టుమర్గుముంటిసూస్తుండె. గండ్రగొడ్డలితీసొక్కని మొత్తెల్నని పోతానూ, మూగినాకొండాలేశెనయ్యా-లేకుంటే బూడాలకానా తెంచేస్తూంటి యెంతమోస్గం శేశిండాయ్యా-సత్తిగం-సత్తిగం తోకరాయడున్నట్టుండావు.

బ్రాహ్మ—పాపనేమిచేసితివి చెప్పుము!

అఘోర—సోమీ! యీ బాపన్నాయాలు నోరు మూయించు ఈడు బలేదబ్బర నాకొండె.

సుద—బ్రాహ్మణా! ఊరకుండుము. అఘోర! తర్వాతనేమాయె.

అఘోర—ఇంకన్నా వూరొక్క బాపన్నబట్టా! అక్కడముంటి యీ మూగినాకొండె నేంటిక్క సంపాల్నని పిల్లోణ్ణి కొండొచ్చయి-పందెజట్టి-యెంతముద్దొస్తుణ్ణేయ్యా!

సుద—చంపితివా?

అఘోర—అద్దిగో! నీకూబుళ్ళె చెప్తే చెప్తానేంటి యెలసస్తాను. సంపింటేయ్యేవు పీక్కుంటుండ్రి. బొక్కెలుకోసి తీస్కుపోయి అకర్రినాయాల్కు సూపించి మడు గుమ్మకొనిపోత్ని.

సుదర్శ—హా! దైవమా!

[ ప్ర॥ సేవకుఁడు మదనునితో. ]

సేవక—దేవా! మంత్రిగారింటిలో నుండలేదు. మదనమంత్రిగారిని పిలుచుకొని వచ్చి యున్నాను.

సుదర్శ—మదనా! చంద్రహాసుఁ డెందున్నాఁడు.

మదన—ఏవో పూజకుఁబోవుటకని పూజాద్రవ్యముల సేకరించుకొనుచున్నాఁడు. ఇప్పుడేల

సుదర్శ—నీ వీక్షణముఁబోయి వానిఁ గొనిరమ్ము. వైళమ-శీఘ్రము-తత్క్షణము-వాని కేదేని పనియున్న నాపని నీ వొనరింతువని పంపుము. ఇప్పుడే వేగిరమ తడవు సేయక.

మదన— (నిష్క్రమి.)

సుదర్శ—అఘోర! నీవు వచించిన చరిత్రము మాకు సంతోషావహమయ్యె. పోనిమ్ము ఆ బాలునిఁ జంపుటకు నిన్ను నియమించినవాఁ డెవఁడు!

అఘోర—యెట్లామస్సంగి నాయాలయ్యా. అవుతే వాణ్ణిసూశిండ్లే. బకొర్రంగాసూస్తె మొగమీద ముక్కు అస్లాయేసూస్తాను ఎంతపెద్ద ముక్కయ్యా. యిప్పుడు సూపిస్తే పట్టుకొస్తాను. ఇయిగో వాడిచ్చిండే యెయ్యిరూపాలన్ని తాగి-తాగి కెడదాగిపాడు కేస్తి-మాయబ్బతోడు నీవు తోకరాయఁడున్నట్టుండావు యీ కాట్కి యీరెండు రూపాయలు నిల్సింది. (అని మూఁడు రూపాయలిచ్చును).

సుద—(చూచి) బ్రాహ్మణా! ఇవి మా రాజ్యములోని ద్రవ్యము. ఇదే నాముద్రయున్నది అదర్శిఁజూడి రాజ్యముననే యుండవలయు. ఈయఘోరునందండుఁగొనిపోయి గుఱు తింపుచునట్లొనర్తము. మామణిమంతునకు నెడమభుజముపై గురుతు మచ్చయుండెనని చెప్పియుంటివి. ఇప్పుడు చంద్రహాసునిఁ జూచిన విశదము కాఁగలదు.

(ప్ర॥ చంద్రహాసుఁడు,)

సుద—(చంద్రహాసునిఁ గూర్చుండఁబెట్టి భుజము పరీక్షించును.)

అఘోర—షోకపిల్లనాకొండ్యా. ఈడ్యాడొస్తివిరా!

సుదర్శ, బ్రాహ్మ—హా! మణిమంతా! మణిమంతా! (ఆలింగనము)

చంద్ర—మణిమంతా! నేమణిమంతుఁడనా! నాపాలక జనకుఁడడుగఁగా "మమ్మంత" యంటినఁట. ఆమణిమంతుఁడను పేరివాఁడవేనా?

వాసం—(రభసముగఁ జనుదెంచి) హా! అన్నా! మణిమంతా! నాకైఁపపనిదుఃఖిం చుచున్న సోదరా? (ఆలింగనము చేసుకొనును.)

## అనుబంధము 41.

మద—కుమారీ! ఇంకేల తడవు? నాకోరనభంగి మణిమంతుఁడును నీకోరిన చంద్రహాసుఁడును నగునిక్కఁడే నీకొడవె. ఇదియేసుము హూర్తము (చేయిపై చేయిపెట్టించును)

చంద్ర—ఏమిటిదిది? నాకిట్టియైన వచింపుఁడు.

అఘోర— ఓ-యన్నల్లాలా! మణిమంతా-మమ్మంతా-మణిమంతా-మమ్మంతా-(ఎగరులాడును.)

మద—మణిమంతకుమారా! సావధానముగఁ గూరుచుండుము. నీచరిత్రమంతయు వివరించెద.

మణి—ఈ యున్మత్తురాలని నేసెంచియున్న కాంతామణి యెవరు?

వాసం—అన్నా! అది మోహనాస్వాదము.

చంద్ర—అయిన నేనెవ్వఁడను.

మద—అందఁ గూర్చుండి మాటలాడుదమురండు. ఈ యఘోరునకిఁ జక్కని బహుమాన మిప్పింపవలయు.

## అనుబంధము 42,

అఘోర—ఇట్లయ్యేటట్టయితే బమాము వొక్కొక్కపిల్లోన్ని కోడకొచ్చానే?

(నిష్క్రమి)

— (0) —

## విష్ణుమాహాత్మ్యము-ద్వితీయరంగము.

### కుంతలరాజ్యాలయము.

[ ప్ర॥ కుంభీనసుఁడు (పాముల సంచులతో). ]

కుంభీ — వేళయయినది ఇక్కడి కార్యములన్నియు సిద్ధమైనవి. ఈగర్భగుడి వెనుకటి గోడకును దుర్గావిగ్రహమునకును గొంచమైన నెక్కడ యెడము చాలదు ఈగోడలోఁ దగినంత గండి నెట్టియున్నాను. అదురాత్ముఁడు నేఁజెప్పిన ప్రదక్షిణ మొనర్పుటకై వచ్చి ప్రదక్షిణత్రితయము గావించుఁగదా! రెండవప్రదక్షిణ కాలముననే యీసంచి లోని పాముల నిట్లు లోపలికిఁ బంపెద. అప్పుడే మగియఁగలదు. తప్పినా, మూఁడవ సారికి మఱియొక సంచియున్నది. కాని! ఎట్లు తప్పించుకొనునో! అయ్యయ్యో! నాజామాతయే వానివధించుట కిట్లేటికి సమకట్టితి? దానివలన నాకుఁగలుగఁగల ఫలమయిన నేమి? ఎట్లును వాఁడు నాతనయఁ జేపట్టియున్నాఁడు. ఈరాజబిడ్డ చంపక మాలినియింక నిశ్శంకముగా నా సుతుఁ జేపట్టవచ్చును. అప్పుడు నాకు నిరాటంకము గదా ఇట్లేలయొనర్పవలయు? అక్కటా! నాకిటుకాదు. వీఁడు నాయాజన్మశాత్రవుఁడు. వీఁడుండిన నాకు క్షేమము గలుగదనితోఁచుచున్నది. అదిగాక యాకేరళబ్రాహ్మణ పాతకుఁడు నాకంటె నసాధ్యుఁడు. వాఁ ఘోరదురాత్మునిఁ బట్టియున్నాఁడట. ఇంతలోన నేవచ్చెదనని జాబు వ్రాసియున్నాఁడు. వాఁడు వచ్చిన నా క్షేమమునకు భంగము కలిగినను గలుగవచ్చును. వాఁడు నన్ను గుఱుతెఱుఁగఁడు నిజమే. అయినను, నేమార్గమున నెట్లు వచ్చునో. అదిగాక నేఁ జందనావతిలో నా కలిందకపాతకుని రాజ్యమూరుని గాఁ జేసిన కాలమునఁ జంద్రహాసుఁడింటిలోఁ జచ్చియుండునని చెప్పితిని. ఇది తెలిసిన నన్ను జను లేమనుకొందురు. అటుపయి నాజాబు మార్చియుండుట గుఱుతించి నిన్ననే నామాటలతోఁ బ్రస్తావవశమున నీ విషయముఁ బ్రశంసించి, "అమ్మా! ఈ చంద్రహాసుఁడు నాకు శాత్రవుఁడని చంపఁ బెంచి మదనునకు వ్రాసి యుండిన జాబు నాపుణ్యవశమున నెవ్వరో మార్చి నీ లగ్నపత్రికగ నొనర్చిరి. ఏమో యొకప్పుడు వానిపై నాకుద్భవించిన సంశయమును బట్టి యట్లొనర్ప నెంచితి. ఇప్పుడు నీమగని గుణయోగ్యతలఁ జూడగాఁ నాభాగ్యమె భాగ్యమనిపించుచున్నది. నీకుఁదగిన మగఁడుగను నాకుఁదగిన యల్లుఁడుగను నున్నాఁడు. నాకెంత సంతోషమైన" దని యంటిని. దానిపై నాకక్కడి వితానే యాజాబును మార్చుట నొప్పుకొని నాచరణ ములపైఁబడి క్షమాపణము వేఁడె. నేను క్షమించితి నంటిని. ఇప్పుడా విషయవిషయమై నాకేమియు భయము కలుగదు కాని యిట్టిజాబు వ్రాసియుంటి నేయని యది తన

మగనితోఁ జెప్పదమటకే మత్తు వారమా? అప్పుడు నేనెట్టి వాఁడనగుదును? ఈచంద్ర హాసుఁడు నన్నెట్లు మాయయని చూచును? కావున నిది కానిపని. పోవలయును నా చంద్రహాసుండుండరాదు. (పాములను గొట్టును. అవిబుస్సనును) హా! ఇట్లుండుఁడు.

అనుబంధము 43.

మీరైనఁ దప్పనిభంగి మీపని రొమరింపుఁడు. అదిగో! దూరమున నెవ్వరో వచ్చుచున్నట్లున్నది అహా! అద చంద్రహాసుఁడే మొక్కుబడి చెల్లించుటను వచ్చుచున్నట్లున్నది. అహా! ఈదురాత్ముఁడు తనమంత్రి నిచుకైనగుటు తెలుఁగఁడుగా? (పాములబట్టుకొను)

[ ప॥ మదనుఁడు (పూజాద్రవ్యముతో). ]

మదన—మాయయ్య నాతో నొక్కనాఁడైనను మనయింటనున్న యీప్రదక్షిణ సంప్రదాయము చెప్పఁడాయెఁగా! ఎవ్వరి పెండ్లియుఁ గాలేదు. ప్రస్తావమును గలుగలేదు నాకు మిక్కిలి యాతురముగా నున్నది. కుంతలేశుఁడంత శీఘ్రముగాఁ జంద్రహాసుఁ బిలుచుకొని యేలగిమ్మనెనో తెలియు కుతూహలము మిక్కిలిగానున్నది. శీఘ్రముగఁ బ్రదక్షిణ మొనరించి పోయెద,

(గుడిలోనికిఁ బ్రదక్షిణ మొనరింప వచ్చును)

అనుబంధము 44.

కుంభీ—(రెండవ ప్రదక్షిణమునకు గోడగండినుండి పాములఁ గొట్టి విడుచును. పాములు రభసమున మదనునిఁ గఱచును).

మదను—హా! హా! దైవమా! (అలి క్రిందఁబడును).

కుంభీ(మిగిలిన పాముల మఱల విడుచును అవియుఁ గఱచును).

మదన—హా! నారాయణ! నారాయణ! అయ్యో! నాపాటునకేమందు! అక్కటా! ఈవృత్తాంతము మాజననీ జనకులతో నెవ్వరు చెప్పువారు? అక్కటా పాములువచ్చి నట్టు భయము కలిగించునని చెప్పినమాట యథార్థముగనే నడచెఁగదా! దైవమా! ఈయరణ్యమున నీయర్ధరాత్రమున నన్నెవ్వరు రక్షించువారు? నను మాయింటికెవ్వరు గొనిపోవువారు? అయ్యయో! నాకిట్లవునని యొక్కనాఁడును దలంపఁగదా? జననీ జనకులు సర్వమహైశ్వర్యములు గలిగియుండియు నాకు నిట్లు దిక్కులేని చావుగలుగునే? నేనేమి చేయఁగలను. దైవమును భజించెదగాక ఒకటిమాత్రము నాకుఁ గడు సంతోషము. దిగంతవ్యాప్త మహాయశుడై కరుణాగుణ భూషణుఁడైయున్న నామ ఱంది యాచంద్రహాస జనవరుండిప్పటికివచ్చియుండెనా యతని కీగతి గలిగియుండుఁ. గదా? అట్లుగాక నేనే దైవాయత్తతమై వచ్చియుండినందున నాకింత యూరటగలి గెడు. అయ్యయో! ఆ చంద్రహాసునకిట్లయియుండిన నాకును నాప్రియసోదరి విషయ

[illegible] పెంకె సంతాపము గలుగుచుండెను! అయ్యయ్యో! ఇంత [illegible] కాదనయ్యె నొక్కటికి మాత్రము పరితాప పడియెద. నా వాసంతిక గలుగదా హా! వాసంతికా.

## అనుబంధము 45.

ఆహా! నాకు మదిదప్పుచువచ్చె. దైవమా! మా వాసంతికను రక్షించి-(మూర్ఛిల్లును).

కుంభీ—(దేవాలయము లోనికి వచ్చి దీపముంచి) ఆ దురాత్ముం డీవలకే నిర్గమించును. నా కన్నులారం బరీక్షించి మారి సంతసించెదంగా.

పంచచామరము

జటాంబు తేజరిల్ల నిన్ను జంద్రహాస మారణ
ప్రయోగమింత సల్పినేం బట్టుకట్టి తీర్చితిన్
భయప్రదోగ్రకల్పుడన్న నాకు వీడు వైరియై
యయో నయోపయోగ హీన హానిజెంది ప్రమందటే.

అయ్యో! నేనెట్లు చూడఁగలను? చూచి యెట్లు సహింపఁగలను? అంతత్యాగియైన తనకుం దానే వెలికిఁ జలియుగదా! పోయెదను-వలదు-వలదు. ఈ దురాత్ముని యొడలు నా కన్నుల నా చేతుల నేనే నమ్మఁగూడని భంగిగలిగియున్నది. పాములు కఱచిన దప్పును వింటిని. ఆ దుర్బుజుండయ్యో యఱచిన యార్తారావము వినుచుకవింటిని. ఇంతవినియును వాఁడు చచ్చునను నమ్మకము కలుగనిభంగి తటస్థించినది. అఘోరుఁడు మోసపఱచి నట్లా పాములు మోసపఱచెనా అప్పుడిది యున్నదికదా (కరవాలము చూచి) మాచెదం గాక. (లోనికిఁ బోయి మూర్ఛిల్లియున్న మదనునిఁ బరీక్షించి చూచి,) (హా! యని మూర్ఛిల్లును).

[ప్ర॥ కాళీ పూజారి.]

పూజారి—ఏమాశ్చర్యమనిన్నీ మా దేవాలయమునొద్ద క్లైవరో వచ్చెనని తెలిసి. నాకేమెయిన ఫలప్రాప్తి కలుగునేమోయని వచ్చితి. లోపల "హా" యను నార్తారవము వినిపించె. ఏమో చూచెద. (చూచి) అయ్యో అయ్యో ఇదేమి విపరీతము. ఈ కుంభీసన మంత్రియు మదనుండును జచ్చియున్నారే! అయ్యో! పోయి రాజున కెఱిఁగింతు. (నిష్క్రమి).

కుంభీ—(లేచి) హా! దైవమా తుదకు నాకీగతి తెచ్చితివా? అయ్యో! నేనింత దైవోపహతుఁడనగుట నెఱుఁగనైతి. ఈ భంగి జరుగఁగలదని కలనైన నెన్ననైతి. ఈ కాలసర్పములం బట్టి ఈ ఘోరకార్య మొనర్చినది నాముద్దుకుమారుఁ జంపుటకా! అల్లుఁడైనను మాననియుఁ, గూతురు విధవయైనను మాననియు నించుకైనఁ గనక

వహింపక తెగించి యిట్టి కార్య మొనర్చినది యీ మోహాంధుఁడనయుని మాంత్రికయు కా దైవమా! నీ వాచంద్రహాసు నెట్లు కాపాడనేర్చితివి? నన్నెట్లు పరిభవింప నేర్చితివి? కుమారా! మదనా! నేనీపాలిపగదాయ యమకింకరుఁడనుమా! నీతండ్రి గాను నీముద్దు మోమింత నాకుఁ జూపుము. కన్నెత్తి నన్నింత తిలకింపుము. తనూభవా! నా చేతులారనే నినుఁ జంపుదునని యొక్కనాఁడు నెఱుఁగనుమా. నీవెన్నఁడైన నను కొట్టితివా! తనయా! నాపాలి మాఱుదైవము వన్ను నీహత్య కారుగాఁ గావించెఁగదా పట్టీ! నీతల్లికి నీకడమాట యేమి వచించెదవు? నేనెట్టి దురాత్ముఁడనైనను, నెట్టి హంతవ్యుఁడనైనను నీపై మోహము వాయని నీతల్లి కలదుకదా? ఆమెకేమి మాట చెప్పెదవు? అన్నా! ఏల యిట్లు కన్నులు తెఱవకున్నావు?

## అనుబంధము 46.

నీ వాసంతికను నీవు మాడనైనఁ జూడవైతివే? అయ్యో! దైవమా! నిను వధించిన కాలసర్పములు నను వధింపఁగూడదా? హా! వాసుదేవ (అని మూర్ఛ).

[ ప్ర॥ శ్రీఘ్రగమనమున పూజారి వెంట సుదర్శనుఁడు, చంద్రహాసుఁడు,
అక్షూరుఁడు, చెంచు, వాసతిక, చంపకమాలిని, విషయ,
బిందోజి, కేరళబ్రాహ్మణుఁడు ]

అందఱు—హా! ఏమైనది? ఏమైనది?

ఇంద్ర—హా! మదనా! (అని పైబడి) అకటా! నేఁడేమి దర్శినము? మిత్రమా! మదనా! ఏల నాతో మాటలాడవు? నేనే మపరాధ మొనరించితి?

## అనుబంధము 47.

విషయ—జనకా! అగ్రజా! ఒక్కసారియే నాకు మీయిరువురు లేకపోయితిరే? నేనెట్లు భరియింతును?

వాసం—నాథా! నాల్గుదినములలో మనసోరికలు ఫలింపఁగలవని మొన్న నాకుఁ బూర్ణాశ్లేష సుఖము గలిగించితివే? నన్నిట్లొనర్పుటకా? అయ్యో! నేనెట్లు భరియింతును?

బిందోజి—ప్రాభుఁడు. కాభుఁడు. నేఁజక్కఁగాఁ జూచెదను. (చూచి) ఈకుమారుఁడు సర్పదష్టుఁడై యున్నాఁడనుట కేమియు సందేహములేదు. ఈమ త్రిసత్తముఁడాంక మూర్ఛిల్లియున్నాఁడని తోఁచెను. మరేమియు లేదు ఈకుమారునికన్నను యింకను ప్రాణవాయువులు వెట్రుకల కంటియున్నవి భయపడకుఁడు. నా మణిమంత్రముల వలన సాధింపఁజూచెదను (చికిత్సచేయును).

మదన—(కన్నులు తెఱచిలేచి) ఆహా! ఏమిది? మీరందఱిందు వచ్చియున్నారు.

అందఱు—(మదను నాలింగనము చేయుదురు).

మదన — అయ్యో! ఇందెవ్వరు పడియుండునది? మాజనకుఁడే? దైవమా! జనకా! జనకా! (తట్టును).

కుంభీ — హా! నిర్భాగ్యము నిర్భాగ్యము (అని లేచును).

అఘో — సామీ సామీ! ఈడే ఈడే. ఈముక్కే ఈకన్నే! శిక్కె! శిక్కె మొప్పె నాకుడె యింకాటిక్కె పొయ్యేవురే?

సుమ — ఏమి? ఏమి! ఎవఁడు? ఎవఁడు?

అఘో — ఈడే-యీడే-యీడే-తప్పదు నాకొండె. యీడే ఏమన్నీ! అగ్గోరా అని పిల్సి యెయ్యిరూపాయలిస్తివే? గుళ్ళోకుంటి బుడుకొన్ని కుక్కొరమ్మంటివే!

చంద్ర — అబద్ధము అబద్ధము అఘోరా! ఇంకూరకుండుము.

అఘోర — వాన్నా! కులికేవురే. మాలోకరాయుఁడు వచ్చి యడిగితే నే గొంకేవన్నొక్కంటివా? యీడే యీడే?

చంద్ర — ఇంకామాట యొక్కసారి యంటివేని నాఁడు నన్ను నీవు చంపవచ్చినదికల్ల నిన్ను నేను చంపువాఁడనౌదు. (అని ఖడ్గమెత్తును).

అఘోర — తీయన్నీ, బిరికినాకండా! యీడంటే యీడే.

కుంభీ — అవును నేనే అవును నేనే! రాజచంద్రమా! చంద్రహాసా! తనయా! వీఁడు నాకడ్డ మాడకుఁడు. నే జెప్పుట ముగించువఱకు నోండాకరుఁడు. నేనొనర్చిన ద్రోహచింతలన్నియు దాఁపక వచించెదను. ఈ కలసియున్న సభయెదుట నీదైవము నెదుట నాయంతస్సాక్షియెదుట ఇప్పుడు పొడువనున్న యీజగత్సాక్షియెదుట వచించెదను. భూమ్యాకాశములందుకు సాక్షులవుదురుగాక. నాదుశ్చరితమంతయు వచించుటచే నాకేమియు ఫలముగలుగదు నిక్కువమే. అయినను నీజగమంతయు విన్న నెంతయు నుపయోగకరము. నాయట్టి దురాత్ములెందఱో యుందురుగదా? వారికెల్ల నాయట్టి ఫలప్రాప్తియే కలుగఁగలదు. ఇదే నాచరిత్రము.

ద్వి॥ జనులార నేఁడు నా చరితంబు విన్న
ఘనసితి సంధాయకముగాదె తలఁప
ఎల్లభూముల వసియించెను ధరణి
నల్లభుల్లనకుఁ గప్పంబుల నొసఁగ 4
యవనతురుష్కులే యాదిగాఁగల్గు
నవనీశ్వరులు "పరా"కంచుఁ బెక్కండ్రు
సామంతులైకొల్వ సరిలేని కడిమి
శ్రీమించు వసుమతిఁ జెలువార నేను 8

నీకుంత లేకున్న కిరవారమంత్రి
నై కూర్మిసఖుఁడనై యకలంకగరిమ
సామంత ధారుణీశ్వరులు పూజింప
భూమిపై విఖ్యాతిఁ బొందినవాఁడ 13
"నాలోచనమున బృహస్పతి యతఁడు
పాలనంబున రమావల్లభుం డితఁడు
ధైర్యంబునను మేరుధరనాథుఁ డితఁడు
కార్యభాగమున యుగంధరుఁ డితఁడు 16
స్థిరతేజమునఁ జూడ దిననాథుఁ డితఁడు
వికజవరమంబునఁ బావకుఁ డితఁడు
సాధింతుననియున్న సాధించువాఁడు
వేధింప యమునైన విడువనివాఁడు" 20
అని జనంబులు కొనియాడంగ జగతి
ననుపమ విఖ్యాతి తారంగఁగంటి
"జగతీశుఁడేలయీ సచివుఁడేమాకు
జగదీశుఁడగు నన్న సరణిఁ బేర్వడితి 24
యవనరాజులు"హుజూ"రనిపిల్చుపలుకు
లవనీశ వరులిఁగా దారయానన్నె
యిలలోని నింత్రైన నెఱుఁగదుకనరు
చెలఁగి యెల్లెడి 'దివాన్జీ'గారటన్న 28
"భళిరా" యటందురు ప్రజలెల్లనన్ను
నింతటివిఖ్యాతి యింతటిగరిమ
యింతటిప్రాభవ మేరీతిఁగలిగె
సుగుణంబుననుగాదు సురుచినిగాదు
మగటిమిఁగాదు ధర్మంబునఁగాదు 32

భూతదయయునుఁగాదు పుణ్యకర్మఁగాదు
సత్తపంబునఁగాదు హితమునఁగాదు
దాఁపక నాచరిత్రము వెల్లడింతు
నీకట్టునన దీని నేపారవినరె

బుద్ధివచ్చినదినంబులనుండి నేను
శుద్ధవర్తనమును జోలియెఱుంగ
సకలంకమానసం బదియొందు నెఱుఁగ
నొకరుని మేలునే నోర్చియెఱుంగ

నొరునింటఁబెడ్లిగాఁ నున్నదటన్నఁ
దరము మీఱఁజేసపరి తాపంబు బూని
యాపెండ్లిశ్రాద్ధమా నందాఁకవగచి
వాపోయి పలవించి వడిసోలుచుందు

ఒరునకొకేడ్పుఁ బుత్త్రిఁ దుదయించెనన్న
గురుతాపమున నాడు కొమరుండునీల్గ
నదనున నెంతయు నారాటపడుచు
పదివాసరములైన వాపోవుచుందు

నెవఁడైన దనద్రవ్య మేపారనిచ్చి
భవనంబుమంచిది పడసెనటన్న
నాభవనముఁగూలి నాపైనఁబడిన
యాభంగిఁదపియించి యడలునమించి

యెడదదావానలం బేర్చివపగిదిఁ
గడయెఱుంగనికీర్తిఁ గడుపువమండి
దుఃరపిల్లిపడినిక్కఁ ద్రొక్కినకోఁతి
కరణి నెయ్యెడనైనఁ గాలూనలేక

యాయింటి నిలఁగూల్చి నంతటిదాఁక
బాయని శోకాగ్ని పాలౌచునుందు
ఇతరు లెవ్వారైన నిద్దఱు మంచి
హితులన్నమాట నొక్కింత విన్నవిత

నైనలేని క్రోధంబు హృదయంబుఁ గలఁప
మనసునిల్పఁగ లేక మాటాడ లేక
వారలవిహితంబు వారించుదాఁకఁ
గూరుకు నిదురనేఁ గోరక యుందు

ఈయసూయాగుణంబు నీయొగ్గ నాకు
శాయనిదప్పస్వ భావంబు లెయ్యె
మిత్రుఁడైననునన్ను మఱుకఁగఁగోయు
శత్రుఁడైననునాకు సమముఁడె యావిఁకి

సంతోషమెఱుఁగ నిచ్చునెవ్వఁడైన
వింతశోకము జెందె వేళలఁగాని
యిట్టిగుణములుండి యింతటిఖ్యాతి
నెట్టులఁబడసితి నెఱుఁగరు గారు

మోసంబుననుగాక మదవారనాదు
వాసిచేఁగాదు నా ప్రఖ్యాతియరయ
ఇంపార రాజ్యంబు నేనయుదురాశఁ
జంపక మాలినీసతి నాసుతునకుఁ

బరిణయంబొనరించు భంగికినదుము
నరుదెంచు మణిమంతు నకటచంపఁగ
మంగళపురికేగి మఱి యఘోరనకు
వెంగలినై ద్రవ్య వితతినిచ్చితిని

చరణాంగళముఁగోసి చలము పోఁద్రోసి
కరిసమాప్తి యొనర్చఁ బరికించివీఁడు
దైవయత్నముగాని తలపోయుమనదు
భావంబు నిష్ఫల ప్రాయంబుసుండి.

చందనావతికేగి చంద్రహాసాఖ్య
నందమొందుచనున్న యాలోకవీరుఁ
గ్రూరకర్మమునాక ఘోరబాణమున
వారింపఁజూచితి వానికంధరము

కత్తుకకేసిన క్రూరనారాచ
మత్తఱిఁ జెవిదాఁకి యదివ్యర్థమయ్యె
దైవయత్నముగాని తలపోయుమనదు
భావంబు నిష్ఫల ప్రాయంబుసుండి.

పెంపరిసుతునకు విషమిచ్చిపీనిఁ
జంపఁగనొకకమ్మ చయ్యనవ్రాసి
పంపితినాలేఖ వానిమోహించి
సొంపుగాంచిననాదు సుతుచేతఁజిక్కె

"విష"మనుమాట వేవేగంబ చెఱిచి
"విషయ"యంచనురీతి వెలఁదిదా మార్చె
"ప్రాణపీడన"మన్న పదముపోనడిచి
పాణిపీడన"ముగా భావింపఁజేసె

"నుద్వాస"మనుమాట నొయ్యనఁద్రిప్పి
"యుద్వాహ"మనుభంగి నొనరంగఁజేసె
నీవింతయేమున నిటుమార్చెతనయ
చావుకమ్మను పెండ్లిజాబొనరించె

దైవయత్నముగాని తలపోయుమనదు
భావంబు నిష్ఫల ప్రాయంబుసుండి.
ఇప్పుడేమనవచ్చు నీవిధంబెఱిఁగి
తప్పనివైరంబు దాళఁగలేక

కులముద్ధరించెడు కొమరుఁడే జ్ఞాన
బలసముగ్రుండగు పాపఁడే యత్యు
దారగుణుండగు తనయుఁడే, తనయ
నెంచి చేపట్టిన యల్లుఁడే యంచు
నించుకంతయుఁ జూడ కీసుత త్రాడు
త్రెంచుటకైన నేత్రాగ్ని నోర్చి యొకట
కాలసర్పంబులఁ గడిమిఁ దెప్పించి
కాళికాలయమున గండి వెట్టించి
మణిమంతుఁడంచు నెమ్మదిఁ బొంగి విడి వి
గుణభూషణుని నాదు కొమరుఁ జంపితిని
దైవయత్నము గాక తలపోయ మనదు
భావంబు నిష్ఫల ప్రాయంబు సుండి.
నానోముల ఫలంబు నా నిదానంబు
నా నిండు భాగ్యంబు నా వంశ ఫలము
నా పూర్ణచంద్రుండు నా జీవదాత
నా పెన్నిధానంబు నా ముద్దుకుఱ్ఱ
నా కూర్మి చుట్టంబు నా చెలికాఁడు
నా కుమారుండిటు నన్నుఁ బాసిపోవ
శోకాగ్ని దహియింప సుకుమారుఁ జూడ
వేకారి దరిఁ జేరు విధిఁ గానలేక
వగ జెందికుంది నెవ్వగ లొందికంది
జగతి దుఃఖపు చాపు చావలో నైతి
నా కామితార్థంబు నకు ఫలంబిదియొ
నా కష్టకృత్యంబు నకు ఫలంబిదియొ
నా యసూయాగుణంబు నకు ఫలంబిదియొ
నా యీర్ష్యజన్మంబు నకు ఫలంబిదియొ
నా దుక్రోధగుణంబు నకు ఫలంబిదియొ
నా దు మాత్సర్యంబు నకు ఫలంబిదియొ

ఈచేతఁజేసిన దీచేతఁగుడుచు
వైచిత్రియయ్యె నెవ్వగలింక నేల
అలయనిఁకేల మహాజనులార
కలుషమెన్నఁడగాని క్షమలించుఁడీ 140

(అనిచెప్పి బాకుచే పొడుచుకొని చచ్చును)

అందఱు — హా! హా! (మూర్ఛిల్లుదురు).

(యవనికపడును).

# అనుబంధములు.

—(o)—

1 కుంభీ—రాగము-పూర్వి-ఆదితాళ.
అనుమానమే చనదు దీనికై
ఘనయో చనయింకనిదేటికి॥ ॥పల్లవి॥
మనుజాధముఁడా మణిమంతుఁడు
మనియుండిననా కేనయుదుఃఖము ౧
కసుబాలుఁడని కరుణచూపినఁ
చెడిపోయెమనీ యెడనాకార్యము ౨

2 మణిమంతు—రాగముజంజూటి-ఏకతాళము.
అమ్మా అమ్మా ఆరాటమాయెనమ్మమ్మ
రమ్మన్నరావుగా రావె రావెయమ్మమ్మ ॥పల్లవి॥
దాదీ దాదీ బాబూచియాడిరా వేమె
మోదముచూపవే ముద్దుగొనఁగరావెమె ౧

3 మణి—రాగము-పీలు-తాళము.
నన్నుఁబాసిపోయితె చనుబాలనీయక దాదియేలా
బాసిపోయితే చనుబాలనీయక ॥పల్లవి
నేనేమిచేసితి నీమోముఁజూపవు
కానరావుగా బూచివచ్చెనె మానవేల ౧

4 కుందు—రాగము-జంజూటి-రూపకతాళము.
పాపఁడెవ్వఁడో బాపుబాపురె

రూపుచూడఁగా భూపసుతుఁడుగా బాపుబాపురె ॥పల్లవి॥
పాలసాహని బాలిశాథముల్
కాలుఁగోసరి కానఁద్రోసిరి బాలశాథముల్ ౧

5 సుదర్శ — రాగము-శంకరాభరణము-అటతాళము.
పాపులెందు దీసిముద్దు బాలునేమి చేసిరో
పాపఁడేమి పాటుగనెనో తాపమాయెనయ్యయో ॥పల్లవి॥
పాలుగారు ముద్దుసుతుని పైననెంతనైరమో
గోలకెట్టిఘాత కోరిచేసియుందురో ౧

6 కుంభీ — రాగము-కమాజ్-ఆదితాళము.
రాజపుంగవా రాజరాజనాకీ యోజనగలిగెను
ఈ జగంబులోన నాకు హితుఁడవు సఖుఁడవువిభుఁడవు
తలఁపఁగ ॥పల్లవి॥
ధీరా ననునొండనకు కడు
పారమొందు లేనిశోక భారముగలిగెను ౧
భూపా కినుకం గనక నను
పాపజాతినాక చేయు మీపవికరుణను ౨

7 కుంభీ — రాగము-బిలహరి-ఆదితాళము.
బాలచేసుకొనవే నీలవేణిరో వెలయఁగరావె
లీలాయతను శీలానానుకి లాలింపవేదయు ॥పల్లవి॥
కోమలాంగిరో నీమనోహరుఁ డేమిచేసియు లేమింగలెను
లేమాయీవగ నామానసము వేమాఱుగలఁచెను ౧

8 విషయ — రాగము-జంజూటి-ఆదితాళము.
కరుణించి పాలింపుమా ఆలింపుమా జనకా ॥పల్లవి॥
వారక కోరని వానికినన్నిటు ధారవ్రాయనీకునింత
భారమా వైరమా నేరమా గంభీరమా జనకా ౧
ఈ పరిణయమున కోపనిపుత్రిని రూపు మాపనీకునీర ౬
రూపమా తాపమా కోపమా నా పాపమా ౨

9 విషయ — రాగము-వరాళి త్రిపుటతాళము.

కనికరమింతయైన గణియింపలేకనన్ను
జనకుఁడు విక్రయింప మనసున నెంచెనయ్యో ॥పల్లవి॥
మనఁజాల నింకభూమి ననుఁబ్రోచువారలేరె
వెనువెంటబాయుదాన విననొల్లప్రాణముల ౧

10 మదన — రాగము-తోడి-ఆదితాళము.

నన్నుదూరకు నేరంబెంచకు విన్నపమాలకించి
కన్నతండ్రివి కారుణ్యంబున మన్నింపఁగరాదె ॥పల్లవి॥
మోసమెంచకు మాతాడని నీసుతుఁడనుకానే
వాసినిల్పుముదయచేనాకా వాసంతికఁగూర్చి ౧

11 కుంభీ — రాగము-నాదనామక్రియ-రూపకతాళము.

సంతాపమాయెఁ జాలఁగనాకు
నెంతనినామది జింతింతునో ॥పల్లవి॥
శోకాంబురాశి సొంది మునిఁగితి నీకబోవఁగఁజేసి వెంగలినై
చీకాకుగలిగె
నాకులగతి మీఁద వేకారిదరిఁజేరు విధిగానను ౧

12 చంద్ర — రాగము-జంజూటి-ఆదితాళము.

ఇంతేల చింతసేయఁగా నావంతయువలదు ॥పల్లవి॥
రవతప్పి బాణము శ్రవణంబుమాత్రమే
దవిలెనోకింతయు తాపముగలుగదు ౧

13 కుంభీ — రాగము-వసంత-రూపకతాళము.

బాలనీదగు లీలలెల్లను మేలములాయె
మాలవిధిని న్నెందునింత మూలఁజేయునే ॥పల్లవి॥
నీసమంతగ క్రిందుతగుల మోసముగాదే
గాసిపడితె నేఁడు చంద్రహాస కుమారా ౧

14 చంద్ర—రాగము-సురటి-ఆదితాళము.

ఆహా యేమియాశ్చర్యము ఊహాతీతము ॥పల్లవి॥

అలఘువిచారుఁడు సచివేంద్రుఁడనన్నంపెను దనపురికిందు

తెలియఁజాలనేమికలదో దివ్యసుఖము ౧

15 అందరు—రాగము-తోడి-రూపకతాళము.

కనులార చూడరె వనవైభంబు సొంపు చూపఁగా ॥పల్లవి॥

విషయ తరుజాలముల్సరసాలముల్ తమాలనారికేళముల్

హింతాల తాల సాలకోలముల్ ౧

చంపక అళిజాలముల్ బలుకోకిలల్ కలగాన మొప్పఁ జేయఁగా

విలసిల్లుకుంజవీధులెల్ల ౨

వాసంతి సరసిజముల్కుముదంబులున్ సరిమీరికన్నుల

కింపుగా నరుదైన నీరజాకరంబులన్ 3

విషయ వనమల్లికల్ ఘనవల్లికల్ అనువైన వాసనలీనఁగాఁ

జనసొంపునించు పూవుదోఁటలన్ ౪

15 చంపక—రాగము-జంజూటి-ఆదితాళము

వలదమ్మా మోదముమనఁగా ॥పల్లవి॥

ఈ జాబునని కింత తెలియదె యోజన లేలసుందరాంగి

17 వాసంతిక—రాగము-శ్రీరాగము-రూపకతాళము.

తాళఁగలనా బాళియుంచిన నిఁకేల చూడ

బాలయూవిభు జోలిమానిపి చాలదయచేసేలవే ॥పల్లవి॥

ప్రాణనాథుఁడు నన్నుగన్నుల నైనఁజూడక యుండఁగా

దీననైనాప్రాణతతినే నూనియుండెదు దానని ౧

18 చంపక—రాగము-పీలు-ఆదితాళము.

ఊరడు మా యోపారసాక్షి ॥పల్లవి॥

ఈ విధముననే లావగఁజెందెదు

నీ విభుఁగానఁగ లేవెబాలా ౧

19 మదన—రాగము-తోడి-రూపకతాళము

ఈరీతిగ నన్ను దూఱవలదు ఎలనాగా
నేరములవియేవి నాయెడ ||పల్లవి||
కడకొని నాపయిఁ గరుణవహింపవె
తడసిన బడలెదఁ దాళఁజాల ౧

20 మదన—రాగము-నాటకురంజి ఆటతాళము.

ఇది నాపాపమొ మందగామిని నీ
మదినింత దయఁజూడు కామినీ ||పల్లవి||
మన్ననసరిగాదు ననిటులనరాదు
పన్నగవేణి నీదాసుఁడ ౧

21 మదన—రాగము-హిందుస్తానితోడి-ఆదితాళము.

చెలి నామాట మన్నింపవె నాకు
నామోద మునింపవె ||పల్లవి||
కానానుసారముగా నా కీలాగుచేకూరెనె యీ
జాలియేల తాళఁజాల బాళిలీలబాలా ౧

22 విషయ—రాగము-నాదనామక్రియ-ఆదితాళము.

సుందరుఁడీ ధీరుఁడు ఈడెందులేని
అంధము లోచనానందముగావించు ||పల్లవి||
ఎంతని యీసొగసెంతునోరజనీ
కాంతుఁడో జయంతుఁడో వసంతుఁడో యాకంతుఁడో ౧

23 విషయ—రాగము-బిలహరి-ఆదితాళము.

మనసారనీ మహనీయు నిగ్గంటి ||పల్లవి||
కనుగొనినంత మనసుచల్లనయ్యె జనపాలుఁడీసుందరుఁ
డెవ్వఁడో ౧

ఆరుదాయెఁజూడ సారరుచిరరూప
స్ఫురణంబుసార తర తేజమును
నవరూప పంచ శరుఁడౌనో లేక
ధరనున్నపురందరుఁడౌనో తెలియ ౨

24 చంద్ర—రాగము-ఖమాజ్-ఆదితాళము
బాలా చాల మేలాయె నీలాగు
పోలఁ జూడనింకనన్ను పొగడం దగదె ॥మగువ॥ ॥పల్లవి॥
విషయ ధీరా సారా చారాసి పికీర్తి
కోరియాడధన్యనైతి కోదఃవల్ తుదగా గదతె ॥పల్లవి॥
చంద్ర నీరమణీయశృంగారవిలాసము
నారినాకుజూడఁ కలిగె నళిన నయన భాగ్యమె ౧
విషయ మాన్యతనన్నుస మ్మానము జేసితి
ధన్యనైతి నింక నేల ధరణీరమణ మేలాయె ౨

25 చంద్ర—రాగము-పీలు--రూపకతాళము.
నినుఁజూడకింతమిం వఃనుండఁగాంత
గనుమాయీవింత ప్రేమనుబాపుచింత ॥పల్లవి॥
విషయ సదయధీమంతనీ కిదియేమిచింత
ముదమాయెనింత నెమ్మది ప్రాణకాంత ॥పల్లవి॥
చంద్ర బలుతమి మించని మ్మాలనీవు పోవ
కలవాణిని వెంటఁ గడఁగి వచ్చెదను ౧
విషయ ఇంతేలనాథనె నిదెపోయిపత్తు
ఇంతైనఁ దడయని శ్చింతనెలవిమ్ము ౨

26 చంద్ర—రాగము-పీలు (హారసయ్యా అనువెట్టువరస) ఆదితాళము.
నారీమణి సారసపాణిబల్ ధీరగాతరుణీ
చమత్కారము సరిలేనిదయ్యో భళిరెకీరవాణి భళి
భళిరె కీరవాణి భళిభళిరె భళిభళిరె భళిరె భళిభళి

విషయ కాంతనన్ను నింతేకొండాడ వింతయైనా చరిత
నా సంతోషమీడు లేనిదయ్యెనె నెంతో ధన్యనైతి
(మనుజవర మనుజవర మనుజవర) ॥పల్లవి॥

చంద్ర సరసిజనేత్రి నన్ను నరుదారం బ్రోచితివి.
కరుణించి మోహము సమకూర్చితివే తనుదీర్చితివే
(తరుణీ తరుణీ) ౧

విషయ మనుజేశవర నాపై నెనలేని దయజూపి
మనసార నన్నేలితివి మేలితివి కొనజాలితివి రమణా
[రమణా రమణానాదు ౧

27 చంద్ర — రాగము-శంకరాభరణము రూపకతాళము.

ఔరానారీ యరుదానొయ్యారీ ॥పల్లవి॥
పాకారి రాణీయొ కోకారి దేవియొ
లోకవిమోహకా లోకమోహినియో ౧

27 చంద్ర — రాగము-కానడ-అటతాళము.

న్యాయము న్యాయమా కార్యము ॥పల్లవి॥
భారమాని వైరమా గంభీరమా నానేరమా

29 చంపక — రాగము-ఖరహరప్రియ-రూపకతాళము.

యెమరితి నయోయింక నేమిసేయుదు
నామదిని ఘనాయాస మెట్లుతాళుదు ॥పల్లవి॥
పొంగి మోదమాయెనంత భంగమాయె
నింగినేలయొక్కటాయె భ్రమి గరాదయె ౧

30 విషయ — రాగము-ధన్యాసి-రూపకతాళము.

మనుజేశుఁడిట్టులైన మనియుండఁదాననే ||పల్లవి||
చెలమూని నెపునా జనకుఁడె నావిభు
పొలియింటఁ గోరియీ బలుఁజాబుల్నాసై నే
తలఁపఁగనిది విలయముఁగద ౧

31 విషయ — రాగము-సావేరి-రూపకతాళము.

భళిభళిరె ఆహా యీ
బలుమోసన నాకుఁదోఁచెను ||పల్లవి||
కనినంత నెయ్యురుదౌనా ఘనభాగ్యనే పొందును
నను దైవము విభుఁగూర్చి కనికరించి బ్రోచెనేఁడు

32 వాసం — రాగము-నాదనామక్రియ-అదితాళము.

విభుఁడెందునను జూచునో యిఁక హాహా ||పల్లవి||
ప్రాణనాథు గానకున్న ప్రాణము లేననుఁబాయునే ౧||

33 మదన — రాగము-బ్యాగు-ఆదితాళము.

మానవతి మనకిది భాగ్యమానె ||పల్లవి||
ఎంతని నాభాగ్య మెంతు నీరజముఖి
చింతలెల్ల నంతమొందె సంతసము నింతదోఁచె ౧

34 కుంభి — రాగము-సురటి-చాపుతాళము.

భీకరగతిని నీలోకముచూడ నాకెవ్వరైననీడా
నాకోపభరము జీకాకు పడకున్న శ్రీకాంతుఁడో
వాణీకాంతుఁడో గౌరీకాంతుఁడో శచీకాంతుఁడగు నెమి
||పల్లవి||
భద్రముగ డీవినా రౌద్రముగోం క్షుద్రులు పడిపోరా

ముద్రోషమునసంచల్రూపులై నిర్నిద్రుండనే వీర
భద్రుండనో కాలరుద్రుండనో భీసముద్రాడనందరు

35 కుంభీ—రాగము-యదుకులకాంభోది-ఆదితాళము.

తనయునాకరుదాయెగా లింప మాయె
జనకుండన్న వాండె నినువధింపనెంచె ॥పల్లవి॥
ఎచ్చైన నీకరణి విందుమె యేమనగ
నందన సందేహ మొందకు దీనికి ౧

36 కుంభి—రాగము-మోహన-ఏకతాళము.

రమ్యాకాముని చనువెలసినతనయా ॥పల్లవి॥
భూమీశునివర నేమనమిదేకను
తామస మికవిడు తాలిమి ౧

37 చంద్ర—రాగము-సురటి-ఆదితాళము.

కరుణగల్లనీకు జనకుని గలిగించితినాకు
గురుపాపుండని నన్ననంబోకు తరములేని వడిగలిగవితాకు ॥పల్లవి॥
కొలనొసంగుమింత వెడలెద చెలిగిన గరిచెంత
యలఘులీల జనకుని గనునంత కలహజాలనటువూన
[దుచింత ౧

38 సుదర్శ—రాగము-జంజూటి-ఆదితాళము.

వర మదెభగమానా మానవతీ
యుదంతమదేమి విధంబో తెలుపవె ॥పల్లవి॥
తరుణీనీజాడ తాపస నించె
యురాళ శిరోజ బిరాన దెలుపవె

39 చంపక — రాగము-ముఖారి-ఆదితాళము.

అలుకకు యోజనకా హాహా
ఇలగదు పాపిని నేను ॥పల్లవి॥
బడలితినాకై బహుదినములుగా
కడగడునిదుములపాలై విడువవెరుంక నాదింక ౧

40 వాసం — రాగము-బిలహరి-ఆటతాళము.

కాపాడితివి కరుణ తాపము బాపి
నీఋణమెన్నఁడు దీర్పఁజాలను
పారమొఱుఁగ జనకా ౧

41 వాసం — రాగము-కానడ-ఆటతాళము.

చూడనాయె మఱాడనాయె
నేఁడు నాదగు భాగ్యమునిండె ॥పల్లవి॥
ఎన్నఁడుగాంతునం చున్న సోదరునిను
నన్నా యనిపిల్చు నున్నతియాయె ౧

42 రాగము-శహన-రూపకతాళము.

చంద్ర మణిమంతుఁడంచునన్ను మీరు రనసాగినాకు
మణిమంతుఁడెవ్వడో మఱి వినుపించికావరె ॥పల్లవి॥
సుదక్ష శ్రీమీఱు కేరళాధిపు ప్రేమం పుసుతుడవు
నామేనయల్లు వాఁడవో దామీద తనయా ౧
వాసం వాసంతి కాయటంచునక భాసిల బిల్వుమాను
నాసోదరాకృపాకరా నేసంతసించితి ౨
విషయ ఏనాఁడు నెబుట్టితి నానాఁడే పేరిడు
నీనారినంచుఁబల్కి రి ప్రాణేశ కావవే 3

43 కుంభి — రాగము-ఝంఝూటి-రూపకతాళము.

తళ్ళరే పాములార తారసిల్లుఁగాలము ॥పల్లవి॥
మీరలైన వంచనంబు మీఱికాటువెట్టరే
ఘోరవిషమునించినాడు వైరమింతదీర్పరే ౧

44 మదన — రాగము-నాదనామక్రియ-రూపకతాళము.

శ్రీవాసుదేవ మాధవా కావవేదాసుని
భావంబునందునిన్ను నే నేవేళఁబాయను ॥పల్లవి॥
నీపాద నీరజాతముల్ చూపవెకూరిమి
కాపడకేదయానిధీ యాపన్నరక్షకా ౧

45 మదన — రాగము-కాఫీ-ఆదితాళము.

భాసురరూపిణి పావనీ
వాసంతికనను బాసితే ॥పల్లవి॥
మిడికివియోగపు జడనిధినేగతి
గడచెదవ్రామతి కామినీ ౧

46 కుంభీ — రాగము-యదుకులకాంభోధి-రూపకతాళము.

బాలయిందు రారా ఈలాగునవేలార్పఁగ నెలాతినెమె
[లాయిక ॥పల్లవి॥
నన్నుజూడరారా అన్నాయిటులున్నాఁడవె విన్నాణము
[జెన్నారఁగ ౧

47 రాగము-తోడి-రూపకతాళము.

అంధుటు అక్కటా దైవంబమాకీ దిక్కు-తాయఁజేసెతె ॥పల్లవి॥
విపయ నన్ను ప్రీతిచూపి యొందు మన్ననంబు సేయుదే
అన్నరో నేఁడెట మాట లాడకున్న వాఁడవు ౧
వాసం దీనరీతినిఁ చునాకు జేరిచూడఁజాలవే
మానితెనామీఁదకరుణ ప్రాణకాంతపోయితె ౨
చంద్ర అయ్యయో నామిత్రవర్యా హాఁసుగుణధుర్య
నెయ్యముపోదోలితెలా నెమ్మినన్నుఁజూడుమా 3
సుదర్శ ఎల్లవెళలందుమాటి ఉల్లసిల్లు నాడు దె
చెల్లఁబోయిలోవనిట్టి చెటుగల్గఁజాలెని ౪
చంపక ఎంతప్రీతిచూపుచుఁటి వింతమోసమాయెనె
వంతచెవాసంతియెలా గింతపాటుతాళునో ౫



శ్రీ వ్యారి రమావిలాస ముద్రాక్షర శాలయందు ముద్రింపబడెను.